అనైతీఁడిరించె॥ సీ॥ ప్రథమసంధ్యాకాల బలిశంఖనినదంబు ప్రభవించె శ్రీవి
శ్వభర్తనగరిఁ। గడిసెనంగుళియుగ్మకంబంతరముగాఁగ గగనగంగారథాంగ
ద్వయంబు। నెఱియుంగఁగ్రై సేసినిలువుటద్దముచూచెనవిముక్తమునవిశాలా
క్షిగౌరి। కొక్కొరకోయని కుక్కుటంబులు గూసెఁ గడఁగికుక్కుటచతు
ష్కంబునడుమ। ప్రహరిదిరుగుటచాలించిభైరవుండు। గవనిమొగసాలయరు
గుపైఁగన్నుమొగిచె। డుంఠివిఘ్నేశ్వరుండుగంధూష సేసి। యుమిసెవినుపీ
ధిఁజంద్రకుండోదకములు॥ సీ॥ ముక్తిప్రయోజనంబునఁగుటీచరకోటిసావిత్రి
తత్వంబునంగ్రహించెఁ। బరమహంసలుపరబ్రహ్మార్థ మీమాంసశోధించిరు
పనిషద్వీథులందు। నిగమాంతవాసనానిర్వృతస్వాంతులై హంసులుండిరిద్వ
తైకాంతపరతఁ। బత్యగ్రగోజాలరజ్జుసంబంధంబు దండంబులుబహూదకుం
డుదాల్చె। భసితముద్ధూళనముచేసి పాశుపతుఁడు। దీర్ఘపాటలజటలబం
ధించెమౌళిఁ। గలుమఠంబులమీఁద శ్రీకాశినడుమఁ। గొక్కొరకోయనుచుఁ
గోడిగూయుటయును॥ అంత॥ సీ॥ ధరణీధరములందు ధాతుపాషాణంబుపా
దపంబులయందుఁబల్లవంబు। పాథోనిధులయందుఁబవడంపుఁలేఁదీఁగ కాలా
భ్రములయందుఁగోల మెఱుఁగు। హరిదంతనాగంబులందు సిందూరంబుభూ
మి రౌడలియందు హేమభూష। యాకాశపీఠియందబ్జవదనమాలయబ్జభ
వాండంబులందుదివియ। యగుచుబాలాతపముజగంబాక్రమింప। నంధకా
రంబుదిక్కులనస్తమింప। భానుబింబంబుపొడిచెఁబ్రభాతలక్ష్మి। కబరిభా
రంబుమీఁదిచెంగలువకచ్చు॥ వ॥ అయ్యవసరంబున విశ్వానరుండుసకలకలి
కలుషవిషభంగజాంగలికంబగుగగనగంగాప్రవాహంబున నఘమర్షణస్నా
నంబాచరించి విరజానలసంభవంబైన భస్మంబున సర్వాంగోద్ధూళనం బొన
ర్చితిర్యక్పుండ్రంబులు శిరోబాహుమూలంబుల ధరియించి రుద్రాక్షమాలి
కాధరుండయి సరస్వతీస్కందవిఘ్నేశ్వరులకు నాదిత్యానిలాగ్నులకుఁ బ్రమొ
క్కి పుండరీక చర్మాసనంబునం బ్రాఙ్ముఖుండయి దక్షిణజానూరుమధ్యంబు
న వామపాదంబును వామజానూరుమధ్యంబున దక్షిణపాదతలంబునువిన్య
సించి సమగ్రీవామూర్ధకాయుండును సంవృతాస్యుండును నిశ్చలుండును
నై నాసాగ్రంబునసుధాధారాబిందు నిష్యందంబునందునిందుబింబంబువీక్షిం
చుచుం బ్రాణాయామంబుసేసి ప్రాణాయామంబునఁ జిత్తశుద్ధివడసి చిత్తశు
ద్ధివలన వేదాంతజ్ఞానంబువిశదీకరించి విశుద్ధ వేదాంతజ్ఞానవాసనా వశంబు
న శ్రోతవ్యుండును మంతవ్యుండును నిదిధ్యాసితవ్యుండు నిరస్తసమస్తోపాధి
కస్వప్రతిష్ఠాఖండ సచ్చిదానందైకరసా ద్వితీయస్వరూపుండునగుపరమ

శివపరంజ్యోతిర్లింగమూర్తియైన యవిముక్తవిశ్వేశ్వర శ్రీమన్మహాదేవుసం
దుభావించిభావించి చూచుచుండఁ బ్రాచీనంబై పచేళిమంబై భవ్యంబైన
భాగ్యాతిశయంబున॥ సీ॥ శ్రీపాదములఁబైఁడి చిఱుగజ్జియలతోడరవణిల్లు
గండపెండారము మర । వెలిదామరలఁబోలు వెడఁదక్రాల్గన్నులు మద్దికా
యలతోడనుద్దివడయ। మొలకకూఁకటఁగ్రాలుముత్యాలరవిరేక భసితంపు
బొట్టుతోఁబాదరదపఁ। బాలబుగ్గలకాంతిపల్లవంబులతోడఁ జిన్నిలేనగవులు
చెలిమిసేయ। లజ్జయెఱుఁగనికటిమండలంబుమీఁద। వలుదవజ్రాలకమరుగ
ర్వంబుసూప। దివ్యబాలకుఁడొక్కండు దేజరిల్లెఁ । గాశివిశ్వేశశంభులింగం
బునడుమ॥ చ॥ ప్రవిశదభంగిదివ్యశిశురత్నముసప్రణవాక్షరంబుగా। శ్రవణ
మనోహరంబుగఁ బ్రసన్నముగాఁబఠియింపఁ జొచ్చెమూఁ। డవసవనంబునకా
శ్రుతిసమభ్యధికంబుగఁ దత్ప్రతిస్వనం। బవికతలీలగర్భభవనాంతరభూముల
నుద్భవింపఁగా॥ వ॥ అప్పుడువిశ్వానరుండానందాశ్రుపూర్ణలోచనుండు
ను రోమాంచకంచుకితాఖిలావయవుండునుగద్గదికానిరుద్ధకంఠధ్వనియున
యి యంజలీపుటంబులలాటంబునఘటియించి యేకంబుబ్రహ్మంబద్వితీయం
బునిత్యంబొక్కరుండరుద్రుండొక్కరుండ కర్తయెవ్వండట్టినీకు నమస్కా
రంబురజ్జువందుసర్పంబును శుక్తియందు రూప్యంబును మరుమరీచికయందు
సలిలంబునుంబోలె నెవ్వానియందుఁ బ్రపంచంబు గానంబడునట్టి నీకు నమ
స్కారంబుతోయంబునందు శైత్యంబునువహ్నియందుదాహకత్వంబునుదప
నునందుఁదాపంబును జంద్రునందుఁబ్రసాదంబును బుష్పంబునందుగంధంబు
ను దుగ్ధంబునందుఘృతంబునుంబోలెసర్వంబునం దెవ్వండంతరాత్ముఁడై యుం
డునట్టినీకు నమస్కారంబు శబ్దంబు గ్రహించునశ్రవణుండుగంధంబాఘ్రాణిం
చునఘ్రాణుండుదూరంబు నడచునసంఘ్రి చూచునలోచనుండు రసంబుగొ
ను నరసజ్ఞుండెవ్వండట్టి నీకు నమస్కారంబునిజభక్తుండు దక్కవిష్ణువిరించి
పురందరాదిబృందారకులెవ్వానికందువ యెఱుంగరట్టి నీకు నమస్కారము
గోత్రంబుజనంబు నామంబు రూపంబుశీలంబు దెలియరాకుండియుభక్తులకున
భీప్సితంబులొసంగు నెవ్వండట్టినీకు నమస్కారం బెవ్వనివలన సర్వంబును నె
వ్వండు సర్వంబునుంగనుంగొను నెవ్వఁడుసంపన్నుండెవ్వండు దరిద్రుఁడెవ్వం
డు పృథుండెవ్వండు యువయెవ్వండు బాలుండెవ్వండట్టినీకు నమస్కారంబని
సంస్తుతించి సాష్టాంగదండప్రణామంబు సేసిన నతనిం గరుణాతరంగితంబగు న
పాంగవీక్షణంబునంగనుంగొని వృద్ధవృద్ధుండగు నబ్బాలుండుముగ్ధస్మితజ్యో
త్స్న చిన్నిబుగ్గలంజిగురొత్త నిట్లనియానతిచ్చె॥ మ॥ క్షితిదేవోత్తమసీమ

నోరథముసంసిద్ధి వహింపంబతి। ప్రతకుఁ శోభనపుణ్యలక్షణకు విశ్వస్తుత్య చారిత్రకు। పతిమహాభవభాగ్యవైభవకళాపారీణకుఁ మీఁశుచి। ష్మతికిం బుట్టెదఁ గాశికాపురతపశ్చర్యాఫలంబల్పమే॥ గీ॥ అచిరకాలంబునందయేన వతరింతుఁ। బరమపావనియైననీ భార్యయందుఁ। జనునిజాశ్రయమునకుసంశ యముమాని। విమలపుణ్యవిశ్వానరవిప్రముఖ్య॥ వ॥ అనిచూడంజూడన య్యిందుచూడుండానందాక్రీడవాటికాక్రోడక్రీడావిహారహేలాచిక్రోడంబ ద్దంబులోనినీడయుంబోలెఁ బొడచూపి యవిముక్తక్షేత్రా పీడంబగు వీశే శ్వర లింగంబునందుఁ గుడుంగంబునందునుంబోలె డాగియుండె విశ్వానరుం డును విశ్వాన తాత్పర్యంబుమనంబునం బెనంగొన నయ్యనంగమథనుం దలం చి శుచిష్మతియుం దానునంజలిపుటంబు లలాటంబునఁ ఘటియించి ప్రస్తు తించుచుం బ్రమోదించుచు నిజనివాసంబునకుంజనె ననినవిని నైమిశారణ్య వాసులీశ్వరుండెట్లుగి శుచిష్మతికిం జన్మించె ననియడిగిన॥ శా॥ కర్ణాటో త్కళపారశీకనృపసఖ్యప్రాభవశ్రీనిధీ। యర్ణోరాశిపరీతభూభువనమధ్యాం ధ్రక్ష్మాధీశ్వరా। కర్ణాభ్యర్ణవిశాలనేత్ర జగదేకప్రాజ్యసామ్రాజ్యదృ। క్కర్ణాధీశ్వరహారభక్తినిరతక్ష్మాపాలచూడామణీ॥ క॥ పంచారామవ ధూటీ। ప్రాంచత్త్రైలింగరాజపరమేశ్వరయు। భ్యంచితదయాధురంధర। చెం చూమలచూరకారచిరపుణ్యనిధీ॥ భుజంగప్రయాతము॥ త్రిలోకీనకార్యప్రదీ పప్రతాపా। కలాంభోజయూవార్యకల్పావనీజా। నలేక్ష్వాకుదుష్యంతనాభా గలీలా। కలారెడ్డిభూపాల కల్పాంతకాలా॥

---

గద్యము॥ ఇది శ్రీమత్కమలనాథపౌత్ర మారయామాత్యపుత్ర సుక
విజనవిధేయ కవి సార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతంబయిన
కాశీఖండంబను మహాప్రబంధంబునందుఁ
తృ తీ యా శ్వా స ము.

---



శ్రీగురుభ్యోనమః.

## కాశీఖండము - చతుర్థాశ్వాసము.



శ్రీకంఠచరణసేవా। వైకుంఠయకుంఠశౌర్యవైభవలోకా। లోకగిరీపాదపీన। క్ష్మాకల్పయశఃప్రసారయల్లయవీరా ॥ వ ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకిట్లనియె నంతఁ గొంతకాలంబున ॥ క ॥ నెలమసలె నిందువదనకు। జనజాక్షికి నల్లనయ్యెఁ జన్నులముఱుకుల్। తలిరుంబోఁడికి లవలీ। దళపాండువులయ్యె గండదర్పణతలముల్ ॥ గీ ॥ గర్భగోళస్థితుండైన కాలకంఠు। కంఠహాలాహలచ్ఛాయకాళిమంబు। నాభిబిలమున వెడలికన్పట్టినట్లు। కమలపత్రేక్షణకు నారుగానుకొనియె ॥ సీ ॥ సరసిజాననయుదర్విరతిసంధ్యాకాలమానందతాండవం బాడఁదలఁచె। జంతుకోటికిముమూర్షావేళఁ గాశిలో నోంకారమానతీనువిదగోరెఁ। బసిఁడికమ్ములతోడిపచ్చియేనుగతోలు పచ్చడంబుధరింపభామదివిరె। నతివయువ్విళ్ళూరె నారకూటపిశంగ మకుటాగ్రమునఁజందమామఁదురుమ। ముదితగాంక్షించె నేనుఁగుమోముకొడుకు। నంకపీఠమునందుంచియాదరింప। నహరవాంబునుగర్భంబునందుఁజెరుగు। కాలకంఠునియనుభావగౌరవమున ॥ వ ॥ మఱియు ॥ శా ॥ ఆచంద్రాననయధ్వరంబులఁబురోడాశంబుతో మంత్రిత। ధీప్రీణనంబుగయాయజూకులుసమర్పింపంగనాజ్యాహుతుల్। పాశ్చాత్యస్థితినారగింపఁదలఁచున్ బ్రాగ్వంశమధ్యంబునన్। శోచిష్కేశుఁడుగర్భగోళమునఁదొల్బాల్యున్నతింబొందఁగన్ ॥ వ ॥ అనంతరంబ యామాంసగమనకుఁ బుంసవనసీమంతంబులుగృహ్యోక్తప్రకారంబుననిర్వర్తించిన ॥ మ ॥ నవమాసంబులునిండఁగాగురుఁడు కేంద్రస్థాయియైయుండఁగా। శివలగ్నంబుననుద్భవించెనుతుఁడర్చిష్మంతు వంశంబునన్। ధవళాంభోరుహపత్రనేత్రిక విముక్తస్థానవిశేశం। భ్రువతారాంతర మప్రదృశ్యేతర దివ్యాకారతేజంబునన్ ॥ వ ॥ అప్పుడు గంధవాహంబులు దివ్యగంధంబులువహించె ఘనాఘనంబులుపుష్పవర్షంబులుగురిసె దేవదుందుభులు మొరసె దిఙ్ముఖంబులు ప్రసన్నంబులయ్యె వాహినులు విమలసలిల ప్రవాహంబులయ్యె సకలభూతంబుల మనంబులు దెలివింబొందెవిద్యాధరయ

త్రుగంధర్వులు వసిష్ఠవాలఖిల్యాదిమునులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులును గు
మారావలోకన కౌతూహలాయత్తచిత్తులయి యేగుదెంచి రానమయంబున॥
క॥ ద్రుహిణుఁడుఁ గైటభారియు। నహికటకుఁడుఁ గూడియిచ్చి రక్కొడుకున
కుఁ। గృహపతియనియెడు నామము। మహనీయకృపావిధేయమానసులగుచుఁ॥ వ॥ పదునొకండవదివసంబున నామకరణంబుగల్పించి వేల్పులుచన్న
పిమ్మట గురుజనంబులుగ్రమంబున॥ సీ॥ గృహనిష్క్రమంబుసాగించిరి నాల్గవ
మాసంబునందుఁగుమారునకును। వత్సరార్ధమునందు వాలాయముగఁ జేసిరన్న
సంప్రాశనంబర్భకునకు। నంతఁజూడాకర్మమాచరించిరి బిడ్డ నికిగృహ్యాసంప్రో
క్తనియమపరతఁ। దతితోడఁగర్ణవేధంబుగల్పించిరి శ్రవణర్క్షమున నాత్మసం
భవునకు। బ్రహ్మతేజోభివృద్ధికై పంచమాబ్ద। వేళసల్పిరుపాకర్మ విధిసుతున
కుఁ। జదువఁబెట్టిరి వేదంబు పదముగ్రమము। సాంగముగ బాలకునినుపాధ్యాయు
నొద్ద॥ వ॥ అంతనొక్కనాఁడు నారదుండు యదృచ్ఛాగతుండై యతిథిసత్కా
రంబువడసి తనకునమస్కరించిన గృహపతింగనుంగొని దంపతులకిట్లనియె॥
గీ॥ ఓయివిశ్వానరుండ విశ్వోపకారి। యోషచిష్మతిపరమపుణ్యోజ్జ్వలాత్మ।
బాలుఁడీతండు మీమీఁద భక్తిగలఁడె। చేయునావీఁడు సులభుఁడై చెప్పినట్లు॥
సీ॥ తల్లిదండ్రులయాజ్ఞ యధఃకరింప। కుండుటయు చూవెధర్మమత్యుత్తమంబు।
దైవమనఁగ గురుండును నాధర్మమనఁగ। నర్థమనఁ దల్లిదండ్రులె యాత్మజునకు॥ క॥ జ
ననీజనకులఁగొలుచుట। తనయునకును ముఖ్యమైనధర్మము జననీ। జనకులఁగొ
ల్చుటకంటెను। దనయునకభ్యధికమైనధర్మము గలదే॥ సీ॥ నవదరించుటయె
ట్లుజఠరగోళమునందు నవమమాసావసానంబుదాఁక। వేఁకనై సంప్రసూతివేళ
సముద్భూతసంకటంబోర్వంగఁజాలుటెట్లు। కుత్సింపకుండుటెట్లుత్సర్గవిణ్మూ
త్రలాలాదిశ్లేష్మజాలమునకు। నందందవక్షోరుహంబు లెదింపులుపోవఁ దొ
డుకనిచ్చుటయెట్లు దుగ్ధరసము। పంచకరపాట్లువడి లేన్నుఁబెంచి విసికి। యాప
దలఁబాపి రక్షించినట్టి తల్లి। దేవతాబుద్ధి భావించి తెలియవలయుఁ। గొడుకు వం
శాబ్ధిసంవృద్ధి గోనలుసాఁగ॥ క॥ రేపాడిఁగొడుకు జననీ। శ్రీపాదములకు నమస్క
రింపఁగఁ దగుఁ దా। చ్ఛ్రీపాదక్షాళనసలి। లాపోశన మెపుడు సుతులకాయుష్య
మగుఁ॥ గీ॥ సర్వతీర్థాంబువులకంటె సమధికంబు। పావనంబైన జనయిత్రిపాద
జలము వరతనూజులకఖిల దేవతలకంటె। జననియొక్కఁడు సన్నుతాచారనిర
త॥ వ॥ అని నారదుండు గృహపతిం జూచి యున్నవైశ్వానరయిటురమ్మని చే
రందిగిచి తొడలమీఁదం గూర్చుండఁబెట్టుకొని దక్షిణహస్తంబు చూచి లక్ష
ణంబులు పరీక్షించి యంతం బోవక॥ సీ॥ ఆపాదమస్తకంబంగకములును సాంగ

కములుఁ బ్రత్యంగకములు వరుసఁ। దనువైన కార్పాసతంతుసూత్రమునఁ గుంకుమరసాక్తంబునఁ గొలిచి కొలిచి। తప్పక య య్యయి చోట్లు దర్శించి దగ్గించి యంగుళీముఖముననంటి యంటి। నడపించి నిలిచి యుండఁగఁ బెట్టి కూర్చుండ నియమించి పరికించి నిశ్చయించె। లక్షణములు శుభాశుభాలంబనంబు। లంబురుహసూతిసుతుఁడు సంయమివరుండు। సకలసాముద్రికాగమజ్ఞానశాలి। నారదుఁడు సర్వవిద్యావిశారదుండు॥ వ॥ ఇట్లు నిశ్చయించి॥ గీ॥ తిర్యగూర్ధ్వంబు గొలువంగ దేహయష్టి। యెవ్వనికి వేళ్ళు నూఱును నెనిమదియగు। మానమున వాఁడు ధరణిని బ్రమాజ్యపట్టబంధయోగ్యుఁడు భాగ్యవైభవము కలిమి॥ గీ॥ ముక్కు భుజములు లోచనంబులును జానును హనువులును నైదు దీర్ఘంబులగుట మేలు। మెడయు జంఘయుగంబును మేహనంబు। హ్రస్వములుగాఁగవలయు భాగ్యాన్వితునకు॥ గీ॥ నాభిరంధ్రంబు సత్త్వకంఠస్వరములు। మూఁడు నత్యంతగంభీరములుగవలయు। నంగుళీదేశజత్రుత్వగంఘ్రిగుల్ఫ। పంచకము సూక్ష్మమై యుండు భాగ్యనిధికి॥ గీ॥ కరములును గుక్షియును గటిస్కంధములును। ఫాలమును మోమునున్నతి వహియవలయు। హస్తరేఖాదృగంతజిహ్వాధరోష్ఠ। తాలునఖములు గెంపైన ధన్యుఁడతఁడు॥ గీ॥ కటియు వక్షస్స్థలంబును నిటలతటము। విస్తృతము లెవ్వనికి వాఁడు విభుతఁ గాంచుఁ। బదము గోమలమయ్యును బాణి కఠిన। మయ్యు నైశ్వర్యమొసఁగు మహానుభావ॥ గీ॥ తాల్చునెవ్వఁడు భ్రూలతాంతరమునందు। వర్తలంబైన దక్షిణావర్తరేఖ। యాతఁడే కాతపత్రమానట్లుగాఁగ। ధరణిరాజ్యంబు గావించుఁ దథ్యమనఘ॥ క॥ కమలోదరారుణములై। సమగుల్ఫములై మృదుత్వసంయుక్తములై। విమలారుణనఖరములై। చెమరింపని యడుగులొసఁగు సిరి మనుజులకున్॥ సీ॥ లింగంబు గృశమైన లెస్స మాత్రము దక్షిణానత్తవిస్తృతంబైన మేలు। మధుగంధమైనను మత్స్యగంధంబైన నింద్రియంబు శుభంబు నీన జాలుఁ। గంఠనిర్హ్రాదంబు క్రౌంచదుందుభిఘోషగంభీరమగుట సౌఖ్యప్రదంబు। చక్షుఃకనీనిక సరఘామధుచ్ఛాయఁ బింగళంబై యిచ్చు మంగళంబు। నయిదు రేఖల నొసలి వాఁడయుయుతుండు। భాగ్యనిధి ముప్పదియు రెండుపండ్లవాఁడు। కంబునిభమైన మెడవాఁ డఖండకీర్తి। నూర్ధ్వరేఖలపదమువాఁడుత్తముండు॥ గీ॥ హస్తమిరియించి పట్టినయపుడు గదసి। యంగుళులు రంధ్రహీనంబులయ్యెనేని। నతనిఁ గల్యాణలక్షణాన్వితునిగాఁగ। జెప్పు సాముద్రికజ్ఞానసిద్ధబుద్ధి॥ వ॥ ఏను జెప్పిన యీ భాగ్యలక్షణంబు లెన్ని గలవన్నియు నిక్కుమారునియందు సంపన్నంబులై యున్నయవి॥ గీ॥ ఇన్నిగుణములు గలిగినయన్నరునకు। నన్నిగుణములు నొక్కటే యవగుణంబు। లకట యత్యంతనిర్దయుండగు విధాత।

యమ్పలముఁ బరాఙ్ముఖుండ వ్యేనేని॥ గీ॥ చెప్పవో రాజ దేమని చెప్పవాఁడ।
నెఱిఁగినర్థంబు చెప్పక యెట్లుండంతుఁ । బదియు రెండవయేఁట నీబాలకునకు।
గండ మొక్కటి దంభోళికారణముగ॥ వ॥ అని చెప్పి నారదుండరిగిన శుచిష్మతి
యు విశ్వానరుండును శనిపాతదారుణంబైన యమ్మునిభాషితంబునకు భయంబం
దిహాహాకారంబొనర్చి మూర్ఛాంధకారంబున మునింగి యెట్టకేలకుఁ దెలిసి బ
హుప్రకారంబుల విలపించుచుండి రాసమయంబునఁ దల్లిదండ్రులకు నై శ్వాన
రుండిట్లనియె॥ సీ॥ ఓయమ్మ యేలమ్మ యుపతాప మొందెదవో యంబ్రి యేలయ్య
భీతిఁ బొందెదె। దస్మన్ని మిత్తమైయుక్కటమీ శ్రీచరణాంభోజధూళి నాకిహరహం
బు సర్వాంగరక్షయై సంధిలుచుండఁగ మృత్యు వెబ్భంగి నామీఁదఁ గవయుఁ।
గవిసెనేనిఁ గఠోరకంఠ హుంకారంబు నొనరించి మీయానవొందుచు వాఁడ। నా
నయును దోర్చి వచ్చెనేనాగ్రహమున । దీర్ఘనిర్ఘాతసంపాత నిర్ఘృణో
గ్రాకరిణతర వామపదపార్ష్ణి ఘట్టనమున। దానివండ్లన్ని రాలంగఁ దన్నువాఁడ॥
మ॥ వినుఁడీ నా మహాప్రతిజ్ఞ రిపుహృద యోద్వేగంబు వర్జించియో। జనయిత్రీ
జనకుల్ గురుల్ భవదనుజ్ఞాముద్ర చేపట్టియేఁ। జని కాశీపతి విశ్వనాయకు శివుం
జంద్రార్ధచూడావతం । సుని మృత్యుంజయు నాశ్రయించి విగతాశంకన్ జేసె
దన్ మృత్యువున్॥ వ॥ అనిన విని దంపతులపయోధరంబైన వర్షంబునున దుగ్ధాబ్ధియై
న శుద్ధోదకంబునున నిందుబింబంబైన చంద్రికాలోకంబును నైన యామాటకు
బరితోషంబునొంది యెట్టెట్టని క్రమ్మఱఁ గ్రమ్మఱ నడుగుచు సుతున కిట్లనిరి॥
సీ॥ కావఁడే యాభీలకాలపాశనిబద్ధు శ్వేతకేతుని ప్రాణవిగమభీతు। రక్షింపఁ
డే కాళరాత్రి పాల్పడకుండ నెనిమిఁ డేఁడుల శిలాదునితనూజుఁ। బాలింపఁడే విష్ట
పంబులీరేడును గాలకూటాగ్ని నేఁ గాలకుండ। మనుపఁడే యాయుఃప్రమాణం
బునిండినఁ గారుణ్యబుద్ధి మృకండుతనయు। నంధకాసుర వ్యాఘ్ర జలంధరేభ। ద
క్షమఖపుష్పశరపురధ్వంసకునకు। విశ్వభర్తకుఁ గాశికాధీశ్వరునకు। నిందుమౌ
ళికి నినుఁ గాచు టెంతభరము॥ వ॥ అని శుచిష్మతియు విశ్వానరుండును గొడుకు
నాశీర్వదించి యనిచిన నతండును గాశికరిగి మణికర్ణికాతీర్థమాడి విశ్వనాథు
దర్శించి తద్దివ్యజ్యోతిర్లింగంబు గనుంగొని పరమానందకందంబనియును బిం
దుభూతంబైన త్రైలోక్యసారసర్వస్వంబనియును దుగ్ధాబ్ధిసముద్భవంబగు సు
ధాపిండంబనియును గైవల్యవల్లీమతల్లీస్తంబకంబనియును మోక్షవృక్ష ఫలం
బనియును స్వాత్మావబోధపాదపంబునకుఁ బ్రథమాంకురంబనియును బ్రహ్మర
సాయనంబనియును లింగకైతవంబున నాకారంబు భజించి నయనాకారత
త్వంబనియును నానారత్నప్రపూరితంబైన బ్రహ్మాండభాండంబనియును బు

ష్పగర్భంబై వనిర్వాణలక్ష్మీకేశపాశంబనియును సంసారమోహవ్యూహగా
ఢాంధకార విధ్వంసనబ్రధ్నమండలంబనియును నమృతకల్యాణశ్రేణీ రమణీ
శృంగారలీలాదర్పణంబనియును నిశ్శ్రేయసశ్రీకరక్రీడాకందుకంబనియును నప
వర్గోదయాద్రిసుధాకరబింబంబనియును భావించి భావించి వితర్కించి నమస్క
రించి యొక్కపుణ్యాశ్రమంబున శుభవాసరంబున లింగస్థాపనంబు చేసి తత్సమీపం
బున వత్సరద్వయంబు ఘోరంబైన తపంబు చేసెనంతనొక్కనాఁడు॥ శా॥ ఆవిర్భా
వమునొందెనిర్జరవిభుండై రావణారూఢుఁడై। యౌర్వైశ్వానరుచక్కఁగ
న్బైమెఱ బావళీస్తంభదంభోళియున్। గ్రీవాలంకృతితారహారలతికారింఛోళికే
ళీసఖ। గ్రైవేయాభరణాభిశోభియును నై కాశీప్రదేశంబునన్॥ సీ॥ జంభవై
రివిరోధిసాక్షాత్కరించి। వరము వేఁడుమునీతపోవైభవమున। కెనఘు మెచ్చితిన
ముచిసూదనుఁడనేను। నాపుకును నాశుచిష్మతీనందనుండు॥ క॥ ఏవరము వేఁ
డనిస్మనుఁ। దేవేంద్రానికు నాకధీశ్వరుఁడగు కా। శీవిశ్వనాయకమహా। దేవు
నినర్థింతువర మధికతరభక్తిన్॥ వ॥ అనుటయు॥ గీ॥ శ్రీమహాదేవుఁడనఁగఁగా
శీపతియన। విశ్వనాయకుఁడననొక వేల్పుగలఁడె। యేనుపాలింతుఁ త్రైలోక్య
మేనునఖిల। దేవతాచక్రవర్తిఁ సందియము లేదు॥ క॥ నాకంటెనధికుఁ డెవ్వఁడు।
లోకత్రయమునమనంబులో విశ్వాస। స్వీకారమేలవదలెద। వాకాంక్షింపం
గరాదెయభిమతవరముల్॥ అనుటయు॥ క॥ ఏలాయీమాటలఁబని। పౌలో
మీవరుఁడనీప్రభావముకంటే। కాలునిప్రభావమునుసీ। త్రైలోక్యంబెఱుఁగ
వలదెతగవతిపలుకన్॥ మ॥ అడుగన్నిన్నువరంబు వేగమయహల్యాజారవి
చ్ఛేయునా। కుకురాజార్థవిభూషణుండువరమీను న్నాఁడుయుష్మాదృశుల్।
బడుగుల్ వాంఛితమీసమర్థులె వృథాలాపప్రబంధంబులన్। జడి వెట్టంబని లే
దు మిన్నకతపశ్చర్యావిరోధంబుగాన్॥ వ॥ అనియుల్లసంబాడినంగటకటంబడి
బిడౌజుండుద్దీర్ణసురాయుధంబు విబుధవిరోధివధూవైధవ్య దీక్షాదానదేశి
కంబును నిర్ధూమధూమకేతనజ్వాలాజాలజటిలంబును నగు వజ్రంబు గేలంబూ
నివైశ్వానరుముందఱఝళిపించిన॥ శా॥ దంభోళిజ్వలనాభిఘట్టనమునన్ ధై
ర్యంబుపోనాడియున్। గంభీరస్థిరభక్తివైభవమునం గాశీపురాధీశ్వరున్। స్వంభున్
శంకరుసీలలోహితును మానాథున్ విరూపాక్షుని। స్రంభంబొప్పఁదలంచుచుం
ద్విజుఁడు మార్చంబొందె దీర్ఘవ్యథన్॥ వ॥ ఆసమయంబున॥ సీ॥ వికటపా
టలజటామకుటకోటిసిద్ధముగ్ధచంద్రుఁడు జగన్మోహనుండు। గంధమూలకరో
రకాలకూటకళంకకజ్జలుండర్థికల్పతరువు। కుటిలకుండలిరాజకుండలా
లంకారమండితుండాననతాఖండలుండు। భసితధూళిచ్ఛటాపాళిసమిద్ధాళి శాఖి

లాంగుండువిశ్వాధికుండు। విశ్వనాథుండుగాశికాధీశ్వరుండు। శ్రీలఁబ్రత్యక్ష
మైవచ్చిలెమ్మువత్స। యనినఁజైతన్యమందిదిగ్గనఁగ లేచె। శంభుభక్తిపరుండు
వైశ్వానరుండు॥ వ॥ ఈశ్వరుండును వైశ్వానరునాదరించి విశ్వోత్తరంబైన
యీయగ్నిలోకంబునకధీశ్వరుని జేసి యంతర్హితుండయ్యెఁ గృహపతిపరమే
శ్వరానుగ్రహంబున దీర్ఘాయుష్మంతుండును దిక్పతియునై చరితార్థత్వం
బునొందినిజవాసంబునకువచ్చె నిది వైశ్వానరువృత్తాంతంబు॥ గీ॥ అనినఁబ్రి
యుమందిశివశర్మయంబుజాక్షు। కింకరులకిట్టులనియెనక్షీణభక్తి। నిఋతిలో
కంబుమొదలయినఖిలలోక। ములనుజూపుఁడనుక్రమంబుననునాకు॥
వ॥ వైవస్వతలోకంబు మున్నెఱింగితినటమీఁదిలోకంబు లెఱుంగవలసియుం
డుననినవారు మహాత్మాసంయమనీపురంబున కవ్వలజాతిమాత్రంబున రాక్ష
సులై యనుజ్ఝితశ్రుతిమార్గులు నపరద్రోహులు దీర్ఘస్నానపరులు దేవ
పూజాపరాయణులు దానదయాశాంతిదాంత్యస్తేయసత్యాహింసా నిరతు
లుసర్వభోగసములునైన పుణ్యజనులకునివాసంబై నిఋతిలోకంబొప్పుచుం
డు॥ సీ॥ తీర్థములయందువిధిమాడి తెగినపుణ్యు। లనఘులీలోకమునను
దురాత్మహనన। మొక్కకాశీపురంబునఁదక్కనొండు। తీర్థములయందుఁ
బాపంబుదెచ్చునంద్రు॥ వ॥ ఈలోకంబునకధీశ్వరుండైన దిక్పతిచరిత్రంబు
చెప్పెదముసావధానమతివై యూకర్ణింపుము॥ సీ॥ వింధ్యాద్రినడుమనిర్విం
ధ్యాతటంబునఁగానలోనొక్క పక్కణముగలదు। పింగాక్షుఁడనఁబరఁగుపేరి
వాఁడావెంటఁబల్లెయే లెడుభిల్లపరివృఢుండు। క్రూరకర్మపరాఙ్ముఖుండకి
రాతుండు వ్యాఘ్రాదిదుష్టసత్త్వములఁదక్క। దండింపఁడితరసత్త్వములనేనా
డులనాఖేటమార్గంబునందబ్రతుకు విశ్వసించినసీరుద్రావిననునిద్ర। పోయి
ననుజూలుకొన్నను బోర్లుచున్నఁ। దెవులుపడ్డనుగుంటైనదిట్టచెడినఁ। జంపఁ
డనుకంపనెట్టిహింసంబునైన॥ సీ॥ ఫలమూలములనామపక్వాశనంబులద
ధిపయుక్షుద్రాజ్యతక్రములను। శిశిరాంబువులఁదృప్తిసేయునంబడమిచ్చుఁ
బాదరక్షలునాతపత్రములును। దాళవృంతములువస్త్రములుగోవణములునొ
సఁగురోగార్తులనుపచరించుఁ। దస్కరబాధనొందకయుండనెడరైనయట
వీస్థలంబున ననుపుఁబెట్టుఁ। దీర్థములుపోవువారికిదివసదివస। మటువిశేషిం
చికాశికినరుగుసట్టి। పుణ్యులకుఁజేయుసత్కారములు నెరవుగఁ। బింగళాక్షుం
డుశబరరాట్పుంగవుండు॥ గీ॥ సంతతంబును నాశీర్వదింతురతని। దీర్థముల
కేగువారుసంతృప్తినొంది। యగ్నిహోత్రాంతములనుజపాంతములను। భో
జనాంతములనుదృప్తిపూర్వకముగ॥ క॥ దత్తుఁడనివ్విధమునఁబిం। గాక్షుఁడు

సంతతము దీర్ఘయాత్రాపరుల౯ । రక్షింపనటవి నగరస । దృఢుండై యుండెఁ
గొన్ని దినములు పేర్మి౯॥ వ॥ అంత నొక్కనాఁడు తనపితృవ్యుండారకుండను
లుబ్ధకుండు దెరువుగట్టి తీర్థయాత్రాపరులైన కార్పటికుల దోఁచికొనియెనప్పు
డప్పురుసవారు గలగంబాఱి మొఱయునుం గూఁతయునుఁ బెట్టిరి యిట్టివెఱబిట్టు
గల్పాకరంభసమయంబున మజ్జృంభమాణకపటకిటికైటభారాతికంఠనాళకఠోర
ఘుఘుర్ఘురధ్వానఘుర్ఘురంబైన యానిర్ఘోషంబాకర్ణించి యటమున్న
దైవయోగంబున దోరంపు వేఁటకు వెడలి నికటప్రదేశంబుననున్న పింగళా
ఖ్యుండు పైచ్ఛస్వసంబున నోహో వెఱవకుం డేనుగలుగ మీకు భయం బేల
యని పేరువాడి క్రీడికరుబలంబు పైఁ గవయు చందంబునఁ గవసి పుంఖానుపుంఖం
బుగాఁ దీవ్రమార్గణంబులు నిగుడించి లుంటాకులం దోలి మోటవడకుండ సా
ర్థవాహులం గడపి పుచ్చి విమలతరశబరవరసుభట కఠినతరభుజపరిఘవల
యవలయిత పృథులధనురుదితనిశితశరశతఖచిత సకలశరీరుండై వెదురు పెరి
గినయుద్ధంబున వీరశయనంబున శయనించి విగతప్రాణుండై పరోపకారపుణ్యా
నురూపఫలంబున దిగీశ్వరత్వంబునొంది నిర్ఋతియయ్యె నిర్ఋతిలోకంబున కు
త్తరంబున॥ గీ॥ వరుణదేవునిలోకంబు ధరణిదేవ । యిందునుండెడు పుణ్యా
త్ములెవ్వరనిన । వాపికాకూపకాసారవారిపద్మ । వాటికోద్యానకల్పనావ్యా
ప్తిపరులు॥ సీ॥ తరుణేందుమహాళిపై ధారాంబుకుంభంబు నియమవ్రతంబుగా
నిలిపినాఁడు। తనియఁ దియ్యని పంచదారపానకములు భూసురోత్తములకుఁ బో
సినాఁడు। చల్లఁగా నెడకు చేఁజలివందిరులు వెట్టి యధ్వనీనుల దప్పి యార్చినాఁ
డు। దీర్ఘయాత్రాపరాధీనమానసులకు నుదకుంభ్యుపానత్తులొసఁగినాఁడు।
వెల్లిలోనేయుపాయంబు వెంటనైన। మునుఁగకుండఁగ జంతువు ప్రమనిచినాఁడు।
గారవంబున వరుణలోకంబునందు । నిందు వేడుకసుఖయించుచుండువాఁడు॥
గీ॥ పుణ్యతటినులకనతార భూములందు। శిలలసోపానపఙ్క్తులు చేర్చినారు।
జనులసంకిళ్లు విడపించి పనిచినారు। వరుణలోకంబునందున్న వారలనఘ॥ వ॥ ఈ
లోకంబేలు దిక్పాలకుండు వరుణుండు జలాశయాధిపతి యాదఃపతి సర్వకర్మ
సాక్షి యితనియుత్పత్తియాకర్ణింపు కర్దమప్రజాపతినందనుండు శుచిష్మం
తుండనువాఁడు ధైర్యమాధుర్యవైశారద్యాదిశోభనగుణసంపన్నుండు తేఁడు
చిఱుతవయసున సంగడీలయిన బాలకులతోఁ గూడి యచ్ఛోదంబను కొలన
సలిలక్రీడలుసలుపుచు శింశుమారంబు చేతంబట్టువడియెఁ దోడిబాలకులు భయ
భ్రాంతస్వాంతులై యేతెంచి దేవార్చనాసమయంబున సమాధినిష్ఠుండైన
యాతనితండ్రికత్తెఱంగు విన్నవించిరి విజ్ఞాతసుతవిపత్తియయ్యును జిత్తంబు

చలింపనీక యత్తపోధనసత్తముం డభిధ్యానమార్గంబున బ్రహ్మాండంబులభు
వనంబులభూతంబులఁ జంద్రసూర్యనక్షత్ర తారకంబులఁ బర్వతంబులవనంబు
లనదులసముద్రంబులనంతరీపంబుల నానాదేశయోనులఁ దదీయస్థానంబుల
వాపీకూపతటాకకుల్యాపుష్కరిణులం జూచి యందొక్క కెందమ్మికొలనము
నికుమారులతోడంగూడినిమజ్జనోన్మజ్జనంబులరంజిలం గరయంత్రనిర్ముక్తసలి
లధారాభిషేచనంబుల సముడ్డమరకాండ మడ్డుడిండిమధిమధిమ ధ్వానంబుల
దారకుండు విహారంబు సలుపుటయు నప్పూర్ణేందుబింబవదను నిందుబింబం
బుఁబట్టంబఱతెంచురాహువుంబోలె నొక్కమహాగ్రాహంబుసమగ్రగ్రహం
బునం బఱతెంచిపట్టుటయు నమ్మౌనలిసరసబిసకిసలయకుసుమసుకుమార దే
హుండగునక్కుమారునుక్కఁదండనంబులువోలెఁదన రెండుఁ కోఱలంబట్టి
దిక యవక మెయిమెయింగబళించి కనుఁగందకుండ జలాధిదేవతాసమీపంబున
కుం దెచ్చుటయు నచ్చిగురాకుఁబోఁడి యతనిసరిత్పతిసమ్ముఖంబునం బెట్టుట
యునంతలోనం గ్రోధరక్తాంతలోచనుండు నుద్రిశూలపాణియునగు నొక్కదివ్య
పురుషుండుపరుషదృష్టివీక్షించి సలిలాధ్యక్షునధిక్షేపించి యోయి వరుణాల
యకరుణారహితుండవై కర్దమప్రజాపతితనయు శివభక్తుశిశువునక్రింబుం
బంచిదంష్ట్రాక్రకచంబులఁగఱపించి తెప్పించితివి మేలుగాకేమి నీలలోహితు
నిప్రభావంబునీ కెఱుంగవచ్చునేయని ఝంకించిపలుకుటయు నాతంకంబునొం
దియుదన్వంతుండాడింభునలంకరించిశంభుకింకరునకిచ్చి పాశనిబద్ధంబగుసమ్మక
రంబున తనికొప్పనంబుచేసి తత్సమేతుండై పరమేశ్వరునిసన్నిధికిం జని బహు
ప్రకారంబులనుతియించి యపరాధంబువలనవిముక్తుండగుట నద్దేవుండువను
పంబ్రమథుండు జలగ్రాహంబుతోడంగూడం గుమారు నిరోద్ధకుం గొనివచ్చు
టయుం గాంచె నదియు ప్రణిధానావసానంబయ్యె నేత్రోన్మీలనం బాచరించి య
ప్పరమమాహేశ్వరుండు॥ సీ॥ గ్రాహదంష్ట్రాటంకికాశిఖాగ్రముసోఁకికందిన
జఘనభాగంబుతోడ। నుదకబిందుకలాపముట్టియుట్టి పడంగఁగర మొప్పుము
ద్దుగూఁకట్లతోడ। నరుణాంచలంబులై యరవిందగర్భ పత్రములఁబోలుఁ వి
లోచనములతోడ। బహుళయాతాయాతపరిపాటిఁబాటిల్లు గఱువంపునిట్టూ
ర్పుగాడ్పుతోడ। సంభ్రమంబుననచ్చోటనరసి వెడలి। మేటినక్రంబునం దొడ
త్రాటఁబట్టి। వచ్చితనకట్టెదురనున్న వానిఁబుత్రుఁ। గాంచెదుర్దమతేజుండుగ
ర్దముండు॥ వ॥ అట్లుగాంచి॥ క॥ చరణాంభోరుహయుగళీ। పరిసరమునఁ జ
క్కసాగిప్రణుతియొనర్పఁ। గుఱుఁడుప్రమోదంబారఁగ। బరిరంభముచేసెఁ
జచ్చిబ్రతికినకొడుకున్॥ గీ॥ అనఘుశివశర్మయిట్టిచోద్యంబుగలదె యభవు

వర్తించువేళసమాధినుండి । కొడుకు దెసనై నయున్ని పోకులును జూడఁ । గడచె నూఁటయును నై దేండ్లుకర్దమునకు॥ వ॥ కర్దముండు నుసతిక్రాంతం బైన యద్దీర్ఘ కాలంబు మహాకాళధ్యానతాత్పర్యనిష్ఠాతిశయంబున ముహూర్తమాత్రంబునుంబోలెఁ గడపె ననంతరంబ శుచిష్మంతుండును సముచితప్రకారంబు నం దండ్రియనుజ్ఞ వడసి వారాణశీపురంబునకరిగి లింగస్థాపనంబు సేసి పంచవర్ష సహస్రంబులు దపంబాచరించి ప్రత్యక్షంబైన పరమేశ్వరునివలన వరుణపదంబు వరంబు వడసి రత్నాకరరత్నసరిత్సరశిపల్వలంబులకు వాపీకూపతటాకంబులకుం బడమటిదిక్కునకధీశ్వరుండయ్యెఁ గాశియందుఁ గార్దమి ప్రతిష్ఠితంబైన మణికర్ణేశ్వరలింగంబునకు నిబ్బుఱతిభాగంబున వరుణేశ్వరాహ్వయంబైన శంభులింగంబును బ్రసిద్ధంబై యుండు నాలింగంబు సేవించిన వారికి సంతాప భయంబును నపాయమరణభయంబులును మొదలైన భయంబులు పుట్టకుండు నిది వరుణలోకవృత్తాంతంబు॥ సీ॥ అదె గంధవతి చూడు మవనీసురోత్తమ వరుణలోకమునకు త్తరమునందు। నిమ్మహాపట్టణంబేలు గంధవహుండు భవుకృపనీతఁడీ పదముగాంచె । నాదిఁ గశ్యపుని వా యాదుండు పూతాత్ముఁడను పేరి బ్రాహ్మణుండనఘుయితఁడు। తరుణేందుధరు రాజధాని వారాణశినయుతాబ్దములు దపంబాచరించి । లింగసంస్థాపనంబు గల్పించి లింగ । మధ్యమునయందు గంధర్వమథనుఁ గాంచి జ్యోతిరభ్యంతరస్థునావ్యోమకేశు । సంస్తుతిం జేసె తండు విస్పష్టఫణితి॥ వ॥ దేవదేవమహాదేవదేవాభయప్రద బ్రహ్మనారాయణేంద్రాదిసర్వదేవవరప్రదసంస్తుత్యుండవు స్తోతవు స్తుతివిసగుణుండవు నిర్గుణుండవు నామరూపవివర్జితుండవిచ్ఛాజ్ఞానక్రియాశక్తులు నీయవి యొక్కరుండవయ్యును శివశక్తిభేదంబు నద్వైతంబు భజియింతు నీదక్షిణాంగంబచ్యుతుండు చంద్రసూర్యాగ్నులు నీ నేత్రంబులు నీనిశ్వాసంబు శ్రుతులు నీ ప్రస్వేదాంబువులు నదులు నీ శ్రోత్రంబు సమీరంబు నీ భుజంబులు దిక్కులు నీ ముఖంబులు బ్రాహ్మణులు నీ బాహువులు రాజన్యులు నీ యూరువులు వైశ్యులు నీ పదంబులు శూద్రులు నీ కేశంబులంబుదంబులు నీవు ప్రకృతిరూపంబున బ్రహ్మాండంబు సృజియింతు నీయందు సర్వభూతంబులు నీవ సర్వభూతమయుండవ నియనేకప్రకారంబులం బూతాత్ముండు సంస్తుతింపం బ్రసన్నుండై పరమేశ్వరుండతనికోరిన దిక్పాలకపదం బిచ్చి తన మూర్తులయందు నంశంబు ప్రసాదించి సర్వగతత్వంబును సర్వగత్వావబోధకత్వంబును బ్రాణాపానాది పంచమూర్తిత్వంబు నొసంగె నసంధు కాశీక్షేత్రంబున జ్యేష్ఠేశ్వరుని పశ్చిమభాగంబున వాయుకుండంబు నుత్తరంబున బ్రతిష్ఠించిన పవమానేశ్వరునకు నవ్యాక్షే

పంబున భోగమోక్షప్రదత్వంబుసమర్థించి యంతర్హితుండయ్యె నిది గం
ధవతీవృత్తాంతంబు॥ క॥ నిగమజ్ఞాగంధవతీ। నగరమునకుఁదూర్పుదిక్కున గు
ణాధారం। బగుపట్టణమదెయలకా।నగరంబది యేలుయక్షనాథుఁడుగరిమన్॥
వ॥ అక్కుబేరునిచరితంబువినరించెద నాకర్ణింపుము॥ గీ॥ భూసురోత్తమ
కాంపిల్యపురమునందు। యజ్ఞదత్తాఖ్యుఁడొక్కబ్రాహ్మణుఁడుగలఁడు। వేద
వేదాంగవేదార్థవిత్తముండు। యజ్ఞవిద్యావిశారదుండాద్విజుండు॥ గీ॥ అతని
పుత్రుండుగుణనిధియనెడువాఁడు। దర్పకునితోడిజోడు సౌందర్యరేఖ। నెయ్య
ములరంగగురులుపనీతుఁజేసి। చదువఁబెట్టిరివానినాచార్యునొద్ద॥ క॥ ద్యూత
క్రీడారతుఁడై। యాతఁడుకితవులనుదానునాపురిసాయం। ప్రాతస్సమయము
దిరుగున। పేతనిజాచారుఁడగుచునెల్లెడవీటన్॥ సీ॥ బ్రాహ్మణాచారంబుపరి
హాసకము సేయు నగ్నిహోత్రవిధానమన్నవలుగు।సంధ్యాభివందనశ్రద్ధయు
జ్జనసేయు గీతవాద్యవినోదకేళిఁదగులుఁ। బాషండభండదుర్భాషలావర్తిం
చు ద్యూతకారులతోడియుద్దివడయు। ధాతువాదులమీఁదఁదాత్పర్యమొన
రించుఁ జెలిమివాటించునాస్తికులతోడ। నటులమన్నించుహర్షించువిటులఁ
జూచి। వీరమర్దులకొనరించుఁబెద్దతికము। కొలటీయులఁబాటించుగారవిం
చుఁ। జేటకులదీక్షితునిపట్టిసిగ్గువిడిచి॥ వ॥ సజీవనిర్జీవద్యూతంబులనోడినధనం
బులు గితవులకుందల్లిమేనిరవణంబులనమ్మి పెట్టుచుండు॥ గీ॥ తల్లిబోధించుఁ
దత్పరత్వంబుగలిగి। యన్నమీఁయన్న చెప్పినయట్లచేయు। ధూర్తసంగతివిడు
వుసాధువులతోడఁ। బరిచయముసేయుమనిపుత్రుఁబ్రతిదినంబు॥ వ॥ దీక్షితుం
డును గృహకార్యాంతరవ్యగ్రుండై కొడుకువర్తనంబు పరామర్శింపకయుం
డె॥ గీ॥ ఎడపఁద్రడపఁదనూభవుండెచటనుండుఁ। గానరాఁడనిగృహభర్తకాం
తనడుగ। నింతదడవునునాయొద్దనిచటనుండి। యరిగెఁజదువంగననిభర్తకతివ
మొఱఁగు॥ గీ॥ స్నానమాడెనెవార్చెనెసంధ్యయగ్ని। హోత్రమాచరించె
నెయాంతిపుత్రుఁడనిన। స్నానమాడెనువార్చెనుసంధ్యయగ్ని। హోత్రమా
చరించెననుచు నువిద మొఱఁగు॥ గీ॥ గొడ్డువీఁగికన్న బిడ్డండుగావున। నొక్క
రుండ కానసుత్పలాక్షి। ధూర్తుఁడైనవానిదుశ్చేష్టితములెల్ల। నధిపునెఱుఁగ
నీకయడఁచుచుండు॥ వ॥ చూడాకర్మానంతరంబున షోడశవర్షంబున గృ
హ్యోక్తప్రకారంబున నతనివివాహంబుచేసి ప్రత్యహంబును॥ క॥ స్నేహా
ర్ద్రహృదయమైయతి। సాహసకృత్యములుమానుసమకొల్పుటకై। యూహా
పోహవిచారసు। మాహితగతిఁదల్లిసుతునిమతిబోధించున్॥ గీ॥ అన్నమీఁతం
డ్రికోపగాఁడౌనొకాఁడొ। యీవువానరించుదుర్వృత్తమెఱిఁగెనేని। గల్లత

నములుపలుమాఱుఁగప్పిపుచ్చు । నట్టినామీఁదఁజంపంగనలుగకున్నె॥ సీ॥ సచ్ఛ్రోత్రియులుసనూచానులు సోమపీథులునై నకులము పెద్దలఁదలంచి । రాజమాన్యుఁడుసత్యరతుఁడువినిర్మలా చారవంతుండైనజనకుఁదలఁచి । భాగ్యసంపదయందుఁబతిదేవతలతోన నెన్నంగఁదగియెడునన్నుఁదలఁచి । వేదశాస్త్రపురాణవిద్యానిరూఢులై వాసికెక్కినతోడివారిఁదలఁచి । చెడ్డయింటిచెదారకమైశివునికరుణ। నివ్వటిలునిర్వ దేనేండ్లనిన్నుఁదలఁచి। పదియునాఱువత్సరంబులభార్యఁదలఁచి । గోరతనములుమానురాకొడుకఁగుఱ్ఱి॥ గీ॥అఖిలకల్యాణగుణగణాయత్తయుత్త। మామయౌదార్యతేజశ్శ్రమాహితుండు। ధైర్యనిర్జితమందరాహార్యభార్య। తనయుఁడేలయ్యెకైకొవువినయగరిమ ॥ చ॥ విడువకసీవుపట్టణమువీధులవీధులవెఱ్ఱివాఁడవై । చెడుగులఁగూడిధూర్తతములుసేయుమహీరమణుండెఱింగినే । విడుచునుసోమయాజిమనువృత్తులుచేకొనునెల్లవంకలన్। జెడుదుముగాదెనీకతనఁజీరయుఁగూడునులేకపుత్రకా॥ గీ॥ పట్టణములోనసీవుదర్పమునఁజేయు। కొయ్యతనములువీక్షించికూర్మితనయ। నవ్వుదురునిన్నుమొదలనానావిధముల । నవ్వుదురుదీక్షితునిననంతరమజనులు॥ వ॥ అనియంతనిలువక॥ గీ॥ తల్లిబిడికొల్లిచట్టనుచుల్లసంబు । నాడుదురునిన్నుఁగూర్చినన్నహరహంబు। దుర్గయంబెల్లనామీఁదఁద్రోచిజనులు।దబ్బరలుపల్కువారికడ్డంబుగలదె॥ క॥ అవినయనిధానమగునీ ‡ నవయౌవనశైశవములనడిమివయస్సుం। గవిసెనవ్యసనోద్రేకం।బవగాఢముదీనిమానవయ్యతనూజా॥ వ॥ అని యనేకప్రకారంబులబోధించిన తల్లిమాటలుచెవులుసోఁకనీకయిట్టట్టనకయూరకుండె మృగయామద్యపైశున్యవేశ్యాచౌర్య దురోదరపరదారాభిలాషంబులదోషంబులు నవయౌవనారంభంబున సంభవించె నేనివానింబరావర్తింప నెవ్వారునేర్తురు గురువచనం బతినిర్మలంబయ్యు సలిలంబునుంబోలెశ్రవణస్థితంబై యభవ్యునికి శూలపుట్టించును యథార్థనామధేయుండగునగ్గుణనిధి యథాపూర్వంబు దుర్వర్తనంబులందిరుగుచుండ నొక్కనాఁడు॥ సీ॥ దర్శనంబిచ్చెనెద్దానిఁగోమటిక్రొత్త పొడచూపనేతెంచిభూభుజునకుఁ। దనకిచ్చెనెద్దానిదారాంబుపూర్వంబు పుణ్యకాలమునందుభూమిభర్త। దానిచ్చెనెద్దానిధర్మగేహినియైన సోమిదమ్మకుమనఃప్రేమమలరఁ। దటిచూచియిచ్చె నెద్దానిఁబట్టికిఁదల్లి జూదమాడినపైఁడిసుట్టికొనిన।నట్టివరత్నమయమైనయంగుళీయ । కంబుయజ్ఞావభృథపుణ్యకర్మసాక్షి । నీటిలోనొక్కజూదరివ్రేలనున్నఁ। జూచెఁగనుఱెప్పవేయకసోమయాజి॥ వ॥ చూచి తనసొమ్మాట యెఱింగి దీక్షితుం డక్రీడాజీవనుంగదిసి కేలువట్టియెత్తి యా

యంగుళీయకంబు నీ కెట్టు గలిగె నున్నరూపు చెప్పవలెఁ జెప్పితేని భూపాలుస
న్నిధిం బెట్టి నిజంబు దెలిపి దండింపింతు ననిన జూదరి నీతనయుండు గుణనిధి స
త్తంబున నోడిన విత్తంబునకై యీయంగుళీయకంబు నాకిచ్చె మఱి బంగారు
భృంగారు కర్కరీ కలశాదికలు తలియలు పళ్లెరంబులు తామ్రపాత్రంబు లారకూ
టఘటంబు లన్నియుం దాకట్టు వెట్టియు దురోదరక్రీడాపరాయణుండై పట్టణం
బులోనం జరియించుచున్న వాఁడు॥ గీ॥ అత్యధూర్తులలోన నీయనుఁగుఁగొడు
కు। దొరయు నంతటి యత్యధూర్తుండు లేఁడు। క్షితితలంబున యాగదీక్షితుల
లోనఁ। గీర్తి నీయట్టి యాగదీక్షితుఁడు లేఁడు॥ వ॥ అనిన విని లజ్జాక్రోధంబు
లు మనంబులో ముప్పిరిఁగొన యజ్ఞదత్తుం డర్ధముండితంబైన మూర్ధంబున నీ
ర్కావిదోవతి నత్తిముఱిఁ జుట్టుకొని యింటికే తెంచి మొగంబు గంటు పెట్టుకొని
సోమిదమ్మ యేమి సేయుచున్న దానవిటు రమ్మ నీకొడు కెక్కడం బోయెం బో
వుఁగాకేమి నారత్నాంగుళీయకంబు దెమ్మ॥ శా॥ అంగోద్వర్తన వేళ నీవు
దరహాసాంకూరముల్లోచనా। పాంగప్రాంతములం దిగుర్ప నొక పర్యాటంబు
గల్పించినా। యంగుళ్యాభరణంబు పుచ్చుకొనవా యాయుంగరం బిప్పుడే। శృం
గారింపని చేతిఁ బావకునకుం జేయఁగ హవిర్భాగముల్॥ వ॥ అనిన నద్దీక్షితాయిని
యద్దీక్షితునకిట్లనియె॥ సీ॥ మధ్యాహ్నసంధ్యాసమాగమం బిది దీర్ఘ మవధ
రింపుము సంధ్య యాచరింపు। మగ్నికార్యము దీర్పు మభవుఁ బూజింపుము పంచ
మహాయజ్ఞపరుఁడవగుము। మొగసాలను న్నారు జగతీసుపర్వులు గ్రాసార్థుల
గుచుఁ బెక్కండ్ర తిథులు। పక్వాన్నములు శాకపాకాదికంబులు చల్లనాఱిన
యేని చవులు దప్పుఁ। బదిలముగ మందసమునందు బరిణలోన। నునిచి దాఁచిన
దానమీ యుంగరంబు। దీరదిప్పుడు పెట్టె శోధించి చూడ। నారగించిన పిదప
నేనధిప తెత్తు॥ గీ॥ అనిన విని సోమయాజి కోపాగ్రహమునఁ। దత్తరించుచు వడి
సోమిదమ్మఁ బలికె। నవునె సత్పుత్రజనయిత్రి వవునె సాధ్వి। యవునె సూనృత
భాషిణియౌనె భార్య॥ సీ॥ స్వాధ్యాయ మొన్నండుఁ జదువంగఁ బోకుండఁ బో
లునె చదువంగఁ బోయెననుట। తెల్లవాఱఁగ నేటఁ దీర్థమాడక యుండ నను
రూపమే తీర్థమాడెననుట। సమయానుకూలత సంధ్య వార్వకయుండ వైదగ్ధ్
యే సంధ్య వార్చెననుట। తఱితోడ నగ్నిహోత్రము వేల్వకుండంగ విజ్ఞాన
సరణియే వేల్చెననుట। కల్లలాడంగ ఫలమేమి గలిగె నీకు। మాటిమాటికి నేను
నీమాట నమ్మి। యరసి రక్షింపనేరక యనుఁగుఁగొడుకు। భ్రష్టుఁ జేసితి నేమి చె
ప్పంగ గలదు॥ సీ॥ పడఁబోయె నొకదా బెసులామంజిష్టి పెనుఁబందువునఁ బై
టఁ బెట్టఁజాలఁ। దాకట్టువడదె యింతకు వైశ్యగృహమున ఘనపు బంగారు భృంగా

గారకంబు । పట్టుసూత్రమయంబు పసిఁడియొడ్డాణమే యిగురుబోఁడికటీరమెక్కెనొక్కొ । శశికాంతదీపికాస్తంభలీలారత్నసాలభంజికయెందు సాగెనొక్కొ । యెచటనున్నదియో రత్నఖచితమైన । హంసతూలికడోలావిహారతల్ప । మూఁచముట్టుగనీవు నీయొంటికొడుకుఁ । బాడుచేసితి గృహము నిర్భాగ్యులార ॥ గీ॥ చాలునింక నాపాలికిఁ జచ్చినాఁడు । కొడుకు గుణనిధియనువాఁడు కులవిషంబు । తిలలు దర్భయు నుదకంబుఁ దెత్తుగాక । యేనివాపాంజలుల వానికిత్తునిపుడు ॥ వ॥ కుపుత్రత్వంబుకంటె నపుత్రకత్వంబు మేలు కులపాంసనుడైన వీనినొక్కనిం ద్యజించి కులంబు రక్షించుట నీతియకదా యనిపలికి కోపావేశంబునఁ బెదవులదరఁ గటతటంబులదర భ్రూకుటినిటలంబున నటింపఁ గటాక్షంబులం గెంపుగదురం గటకటంబడుచు నాహ్నికంబయిన క్రియాకలాపంబు నిర్వర్తించి యాగ్రహంబు కృతార్థత్వంబు నొందం గొన్నిదివసంబులకు నొక్కశ్రోత్రియుని పుత్త్రిం బెండ్లియాడి యజ్ఞదత్తుండు గృహస్థధర్మంబు నిర్వర్తించుచుండె నంతకమున్న గుణనిధి తండ్రికోపంబెఱింగి యింటికిం బోవకుండి యెక్కడేనియుం జనువాఁడనని మనంబున నిట్లని వితర్కించె ॥ గీ ॥ ఏమి సేయుదు నెక్కడికేగువాఁడ । ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళిక్కి । పెట్టుసాగదు నా చేయి భిక్షసేయ । నెట్టు నేరుచు దైవంబ యెఱుఁగు నింక ॥ గీ॥ ఏభయంబును నెచ్చోట నెనయ లేదు । నరున కెప్పాట విద్యాధనంబు ధనము । చోరబాధాదికముల చేఁజూఱవోవు । ధనము ధనహాని యెన్ని చందములఁదలఁప ॥ గీ॥ అక్కటకటదురోదరవ్యసనమెట్లు । యాయజూకవిశిష్టాన్వవాయమెట్లు । యెట్లు చేసినఁ జేయుఁగాకేమనంగ । నేర్చువారము విధిదయానిస్స్వహృదయ ॥ చ॥ అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేరగిన్నెలోఁ । బెరుగునువంటకంబు వడపిం దెలుసుం గుడువంగఁ బెట్టుని । గ్భరకరుణాధురీణయగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే । హరహర యెవ్వరింకఁ గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్ ॥ వ॥ అనుచు నెందేనియుం జనియె నంత ॥ మాలిని ॥ ఘుసృణకుసుమమాలాకోటిపాటల్యలీల । న్గిసలయముల చాయం గీరచంచూపుటశ్రీ । విసృమరసృమరోర్ణావిభ్రమప్రౌఢిమింటన్ । బిసరుహహితుఁడొప్పుల్ పింగళత్వంబునొందెన్ ॥ గీ॥ పాటలాంశుజటాభారభాసురుండు । భార్గవుఁడువోలె నోలాడె భాస్కరుండు । రాగరక్తచ్ఛటానిర్ఝరప్రపూర్ణ । చరమసంధ్యాశమంతపంచకనదముల ॥ వ॥ వెండియు గోతారకూటపాటలకోమలాతపంబై వాసరంబు పలుకంబోవ నస్తాద్రికిరీటకూటంబున దరవికచవిమలకుసుమమంజరీపుంజంబునుం బోలె మిహిరబింబంబు చూపట్టెఁ జరమధరాధరధాతుధారాప్రవాహంబునుం బోలెసం

ఛాయారాగంబుగగనచక్రంబునాక్రమించెఁ దైల్యద్రుమంబులు విద్రావణద్రో
ణకాకకా కాకారకాకలీకోలాహలకులకులాయంబులయ్యె నంధకరిపుకంధ
రామూలకాలకూటచ్ఛాయాపాణింధమంబై యంధకారంబుబ్రహ్మాండమం
డలంబునాచ్ఛాదించె రజనీశుక్తిముక్తాఫలంబులుచుక్కలువొడిచె భవిష్య
ద్వాసరకరకరప్రరోహబీజాంకురంబులుంబోలెఁ బ్రదీపంబులు భవనాంతరం
బుల వెలింగె నప్పుడుగుణనిధి పేరాఁకలిపేర్చు కార్చిచ్చునుంబోలెఁ బెచ్చువె
రిగియుండంబకడుపుమండింపవంటకంబెక్కడఁగలుగునోయనిచింతాక్రాంతుం
డై యున్నయవసరంబున నద్దినంబురాత్రి శివరాత్రి యగుటంజేసి శైవుండొ
క్కరుండు నగరబాహ్యప్రదేశంబున నొక్క శివలింగస్థానంబున జాగరంబు
జేసి నాలుగుజాలు నుపహారంబు సమర్పించువాఁడై నియమవ్రతంబుపూని
భక్తివిశ్వాసతాత్పర్యాతిశయంబున॥ సీ॥ మరిచిధూళీపాళిపరిచితంబులుమా
ణిబంధాశ్మలవణపాణింధమములు। బహుళసిద్ధార్థజంబాల కాండంబులు
పటురామఠామోదభావితములు। తింత్రిణీకరసోపదేశధురంధరములుజంబీ
రనీరాభిచుంబితములు। హయ్యంగవీనధారాభిషిక్తంబులు లలితకుస్తుంబు
రూల్లంఘితములు। శాకపాకరసావళీషాడవములు। భక్ష్యభోజ్యలేహ్యంబులు
పానకములు। మున్నుగాఁగలయోగిరంబులుసమృద్ధి। వెలయఁగొనివచ్చె
నొండొండవివిధములను॥ వ॥ అప్పుడుభూసురప్రవరుండు నాసికాపుటకుటీ
కుటుంబియగు పక్వాన్నగంధంబు గాలివెరవుననాఘ్రాణించి యాయన్నంబు
నాకునెబ్భంగిఁగుడువ నమకూరునోయని యప్పరిమళంబు నవపట్టుకొని పో
యి శంభుభవనద్వారంబునంగూర్చుండి నృత్తగీతవాద్యంబులు ప్రవర్తిల్ల
నరిప్రొద్దుపోవునందాఁక జాగరంబుచేసి యంతంతసాగి ప్రజలుచొక్కుమడం
గియుండ దానయ్యవసరంబున॥ సీ॥ కట్టాయితంబుగాఁగటిమండలంబునఁదీర్చి
దట్టీచేలదిండుగట్టి। తలుపుగిఱ్ఱునకుండఁదరిమికొంచెంబైన తోరవాకిట దే
హమొయ్యఁజొనిపి। మునివ్రేళ్ళులోయొయ్యయ్య మోపిచప్పుడుగాని పరిపాటిప
వనంబుపట్టినడచి। దీపాంకురచ్ఛాయఁదెలివిసాలనియట్టికొనచీఁకటినిలోనికొ
నరఁజొచ్చి। పళ్ళెరములందపూపసూపములతోడ। ననఁటిపండులతోడ నా
జ్యంబుతోడ। దధిపయఃక్షౌద్రబహుపదార్థములతోడ। ధవళకలమాన్న
మీక్షించెధరణీసురుఁడు॥ గీ॥ గర్భమంటపదీపికాకళికయపుడు। దశచెడఁగ
గాలినిర్వాణదశవహింప। దీప్తిసంక్షుణ్ణముచేసి తెలివిపడఁగ। నన్నమీ
క్షింపఁదలఁచెబ్రాహ్మణకులుండు॥ శా॥ గ్రుక్కిళ్ళింగుచు నొక్క యోద
న మహాకుంభంబుపేక్షించివాఁ। డక్కోణంబున మందరశ్మియగుదీపాంకురా

రముల్ విూఁదికై । యొక్కఁడ్రోచి ఘృతంబునించి నిజవస్త్రికాంతముంజిం
చిచే। నొక్కవత్తిగ నేతఁ డొఁచెను శిఖనొయ్యజించె వైశ్వానరుఁ॥ సీ॥ పక్వా
న్నపాత్రంబు పాణిఁ గైకొని బహిర్ద్వారభూమి భుజించువాంఛ నతఁడు। వెల్వ
డి వచ్చుచో విధివశంబున వానికాలి వ్రేలొక నియుంగంబు దాఁకె। దాఁకిన వాఁ
డు దత్తరపాటుతో మేలుకని మ్రుచ్చు మ్రుచ్చంచుఁ గళవళించెఁ। గళవళింపఁగ
దారగతిక మార్గంబున నాక్రోశ మొనరించి రఖిలజనులు। నన్నపాత్రంబు వి
డువక యువనిసురుఁడు। పాతె భయవిహ్వాలుండయి బయలువట్టె। వెంటఁదగిలి
తలారులు వెగడుపడఁగ। బాణముల నేసి చంపిరా బ్రహ్మకులుఁ॥ గీ॥ అతనిఁ గొ
నిపోవఁ బనిఁ బూని యముని భటులు। వరుణపాశాగ్రహస్తులై వచ్చిరపుడు। వా
నిఁ గొనిపోవఁ బనిఁ బూని వచ్చిరపుడు। త్ర్యంబకుని కింకరులు విమానంబుఁ గొం
చు॥ వ॥ అనంతరంబు పట్టిస త్రిశూల ఖట్వాంగ ప్రముఖ బహువిధ ప్రహరణపా
ణులగు పినాకపాణి భటులం జూచి భీతచిత్తులై కృతాంతకింకరులు కరపంక
జంబులు మొగిడ్చి యిట్లనిరి॥ గీ॥ అభవుకింకరులార మహాత్ములార। తగవు
ధర్మంబు పాశిపంతంబు దెలియు। మీకు నడ్డంబు గల దె ముల్లోకములను। నెం
తవారము మేము మీ యెదురనిలువ॥ వ॥ వీఁడు కులాచారహీనుండు వీఁడు పితృ
వాక్యపరాఙ్ముఖుండు సత్యశౌచపరిభ్రష్టుండు సంధ్యాస్నానవివర్జితుండు
శివనిర్మాల్యహర్త వీనియందొక ధర్మంబు లేశంబుఁ గలిగిన నానతిండు విని
యెదము వీని పుణ్యాపుణ్య వివేకంబునకు మీర ప్రమాణంబనినఁ గృతాంతకిం
కరుల వాక్యంబు లాకర్ణించి శివకింకరులు వారికిట్లనిరి॥ క॥ శివధర్మంబ
తిసూక్ష్మము। శివధర్మము లేశమాత్ర సిద్ధించినయే। వివిధమహాపాపోపద్రి
వములు చేరంగరావు ధన్యునినతని॥ గీ॥ స్థూలదృష్టి వీక్షించినఁ దోఁపకుండు।
సూక్ష్మదృష్టి వీక్షించినఁ జూడ్కికందుఁ। గాన శివభక్తిమార్గంబు గాధమ
హిమ। కానవచ్చిన యట్లుండుఁ గానరాదు॥ క॥ ఆచారంబిది యనఁగను। నా
చారంబిది యనంగ నజునకునైన। గోచరము గాదు శివధర్మాచారము సూ
క్ష్మసూక్ష్మమై వర్తిల్లుఁ॥ వ॥ ఇతఁడు చేసిన పుణ్యకర్మంబులు వినుండు॥ సీ॥ అ
శనము బ్బకయున్ననైనను శివరాత్రి యొరంత పొద్దునుపవసించె। నోగిరంబు
హరింపనొన వెట్టుకొనినైన యొన వేగునంతకుఁ జేసె జాగరంబు। పాతాళివలోకనో
పాయంబునకునైన వెలనైన దీపంబు వెలుఁగఁ జేసెఁ। జూడనొల్లకయైనఁ జూ
చె నీశ్వరుమహాళిఁ బరులు చేసినయట్టి ప్రసవపూజఁ। జచ్చె విధివశమునాడి యైనను
జంద్రధరుని। నగరి మోసాలఁ బెంద్రోవనట్టనడుమ। సూక్ష్మదృష్టి విచారించి
చూచినప్పు। డింతకంటెను ధర్మంబులెవ్వి గలవు॥ వ॥ అనిపారిషదులు య

మదూతలపీడఁ గాలిపి యతనిదివ్యవిమానారూఢుం జేసి శివలోకంబునకుం గొ
నిపోయి శివునిసన్నిధిం బెట్టిరి శివుండును బ్రదీపతేజస్సంధుక్షణాదిపుణ్యానురూ
పంబైన ఫలంబునం గళింగదేశాధిపతియైన యరిందమునకుఁ దనయుండై ద
ముండను పేరనా దేశంబునకు రాజుగా ననుగ్రహించి పుత్తెంచె నీశ్వరానుగ్రహం
బునం బట్టాభిషిక్తుండై॥ క॥ చాటించెఁ గళింగేంద్రుఁడు। వీటను దేశమున శం
భువేశ్మంబులలోఁ। బాటించి దీపకళికా। కోటులసంఖ్యములు మెండుకొని
యుండుటకున్॥ క॥ ఇలువరుసఁ జంద్రశేఖరు। నిలయంబున దీపకళిక నిలుపని
వారిన్। దలఁ దెగ్రవ్వఁగ వ్రేయుండని। తలవరులం బంచె రాజు దనదేశమునన్॥
వ॥ దీపికాదాన పుణ్యప్రభావంబునఁ గళింగాధిపతి జన్మాంతరంబునం గుబే
రుండై యీశ్వరునకు సఖుండయ్యె నావృత్తాంతంబు వినిపించెదము సావధాన
మతివై యాకర్ణింపుము॥ సీ॥ పద్మకల్పమునందు బ్రహ్మమానససరోజము
నఁ బులస్త్యుండు సంభవించె। నాపులస్త్యునకు మహాముని ప్రవరుఁడా విర్భా
వమును బొందె విశ్రవస్సు। విశ్రవస్సునకుఁ దపశ్శ్రీసనాథుండు వైశ్రవణుఁడు
సముద్భవమునొందె। వైశ్రవణుండు సర్వజ్ఞు నెచ్చెలికాఁడు పాలించె నలక
యన్ పట్టణంబు। ఘనయశుఁడు మేఘవాహనకల్పవేళ। యాజ్ఞదత్తి ధనేశ్వ
రుఁడయ్యెఁ బిదపఁ। జిత్ర్రికాశిక గాశికేఁ జేరవచ్చి। శివుఁ బ్రతిష్ఠించె నవిము
క్తసీమయందు॥ మ॥ అవిముక్తంబున యాజ్ఞదత్తి శివు నీహారాద్రిరాట్కన్య
కా। ధవు నిందప్పక చూచుచుండె నయుతాబ్దంబుల్ నిమేషక్రియా। వ్యవహా
రస్పృహ లేని నేత్రములఁ జర్మాస్థుల్ సిరావల్లరీ। నివహంబుల్ పరిశుష్కము
ల్దవభివర్ణింపఁగఁ దైలోక్యమున్॥ సీ॥ గజదైత్యదమనుండు కార్పాసఫల
తూల వర్తి ప్రరోహభావము భజింప। వడకుగుబ్బలిరాచ వారికూరిమికన్య
యాలంబనస్తంభయష్టిగాఁగ। బరమవిశ్వాసతాత్పర్య నిర్భరభక్తిసంపద్వి
శేషంబు చమురుగాఁగ। బ్రవితతధ్యానధారాసముద్భాయంబు సమధికోజ్జ్వ
లతరజ్వాలగాఁగ। గామమును గ్రోధమును నాదిగాఁగఁగలుగు। శాత్రవులు
పాతకములైన శలభములుగ। విమలవిజ్ఞానదీపంబు వెలుఁగఁ జేసె। స్వప్రతిమ
ధైర్యసంపత్తి యాజ్ఞదత్తి॥ గీ॥ విమలవిజ్ఞానదీపంబు వెలుఁగుచుండ। శాం
తిధారాజలంబుల జలకమార్చి। భవుని నర్చించె భావపుష్పముల భక్తి। నతివి
శుద్ధమనోవృత్తి యాజ్ఞదత్తి॥ వ॥ ఇవ్విధంబున యాజ్ఞదత్తి విజాతీయప్రత్య
యావ్యవహితసజాతీయ ప్రత్యయసంతానానువృత్తి రూపంబైన నిదిధ్యాసనం
బున నివాతనిష్కంపదీపంబునుం బోలెఁ బెద్దగాలంబు కాలకంఠు నుంగళజ్యోతి
ర్లింగమూర్తి నంతరంగంబున నాలింగనంబు సేయుచుండ నాఖండేందుహా

ప్రసన్నుండై వత్స పరంబు వేఁడుమనిన సమాధినిమీలితంబులైన లోచనం
బులు దెఱచి కనుంగొనునప్పుడు శతసహస్రకోటి సూర్యప్రభా భాసురంబైన
తేజోమండలంబునడుమ ఫణికుండలుండును దస్తారకూటపాటల జటాజూట
కోటీపినద్ధముగ్ధేందుండును దుగ్ధదారాధవళస్నిగ్ధభసిత విశుద్ధదేహుండునయి
యుద్దీనతానూర్ధ్వాభిషిక్తుం డర్ధాంగలక్ష్మియైన భవానితోడంగూడి పొడ
చూపిన విధూమధూమకేతనజ్వాలాజాలంబుతో మేలంబాడు నమ్మృడునో
డలిదీప్తి మిఱుమిట్లుగొనుమ వెఱచ వసతిమతింజలించినం దూరం దారుపో
యియూతనికన్నుల శక్తిగడతేసంభ్రమంతుండై యంధకారాతినందుం దలప కార
ఛాందోగ్యముండకైతవేయబృహదారణ్యక శ్వేతాశ్వతరాద్యుపనిషత్తుల
ను బంచబ్రహ్మపంచాక్షర ప్రణవాదిమంత్రంబులనారాధించి యంజలిపుటం
బులలాటంబున ఘటియించి నిర్నిరోధనిరవగాధ కరుణారసుదాపూరపూరితాం
తఃకరణశరణు దేవతాకోటికోటీరకోటీఘటిత మణిమయూఖరేఖాపుంజకిం
జల్కితంబులు త్రయ్యంతవిద్యాసీమంతినీసీమంతసీమాసిందూరపరాగ పాట
లంబులు కుటిలకృతాంతదంతతాడనక్రీడానిష్కృపంబులగు శ్రీపాదపద్మంబు
లుదర్శించునట్టి సామర్థ్యంబు గృపసేయవేయిదియునాకు వరంబనినం ద్రివ్యం
బకుండుబింబఫలారుణాధరంబునంజిఱునవ్వు చిగురుకొనం దపస్వికిదివ్యదృష్టి
యొసంగినం గృతార్థుండై యతండు॥ చ॥ చులుకన మేలుకన్న తొలుచూపు
నఁజూచెబినాకపాణిదా। వలిదేసపోడశాబ్దముల పాలియమునమత్తచకోరనే
త్రిను। త్పలదళదామకోమలవిభాకమనీయమనోజ్ఞగాత్రిం గుం। డలకటకాం
గదాదికకసద్భహురత్నవిభూషణోజ్జ్వలన్॥ వ॥ అయ్యవసరంబున॥ చ॥ వ
కులఫలానుకారులయినట్టివలై మెఱుఁగారుకొత్తమా। క్తికముల పేరో
కింతమళికింపఁగనిర్మలహేమకత్నక। ణికలు చలింపనగదియలక్రేంకృతిగం
కణమేఖలాధ్వనిం। బ్రికటము సేయు మందగతి భాస్వరనవ్యవిలాసమేర్పడన్॥
గీ॥ అసమబాణపునర్జీవనౌషధంబు। రాగజలధివిధూదయారంభవేళ। సకల
జగదేకసౌభాగ్యజన్మభూమి। శంభుడాయంగవచ్చె నాశైలతనయ॥ వ॥ ఇవ్వి
ధంబునడాయవచ్చి కాలోన్మీలితశిరీషకుసుమ కేసరమాలాసుకుమారంబు క
స్తూరికాస్థానక ముద్రాభిముద్రితంబును నై సభుజంబు భుజగాభరణభూషితం
బైన ఫాలలోచనుభుజంబొరయ నట్టుగానిలిచినంజూచి యాజ్ఞద త్తిచి త్తం
బునందు॥ సీ॥ ఎవ్వతె యీముకొఱ్ఱయీయిందుబింబానన జగదేకసౌభాగ్యజ
న్మభూమి। కమలాయతాక్షి నాకంటె నగ్గలముగా నెటుచేసెనొక్కొ తాసీ
ంపంబు। పరమేశుఁడీబింబఫలపాటలాధర ననుమీఱమన్నించినాఁడుమేలె।

భాగ్యంబుగా కేమిబాలేందుశేఖరుకృపగాంచెనీరాజకీరవాణి। యనుచుఁ గ్రే
గంటనీరసంబుఁ గురింపఁ గినుకఁ బులికించితమునాత్మఁ గీలుకొనఁగ। సవతిపిక్షిం
చుఁ బ్రౌఢ యోషయునుబోలె। బ్రాహ్మణుఁడు చూచెఁ బర్వతరాజతనయ॥
అప్పుడు॥ సీ॥ కృత్యపంచకము సాగింపలేఁ డేయింతి ప్రాపు లేకకృతాంతభంజ
నుండు। విండుజందురునిజంద్రికవోలె నేభామ పంచబాణవిరోధిఁ బాయకుం
డు। నేలేమశశిమౌళికిచ్ఛాక్రియాజ్ఞాన శక్తిమైకల్పించె సకలజగము। నేగం
ధగజయానహృదయమువ్విభ్యార్చి భవుని మైఁ జక్కఁ బాఁ బాలుఁ గొనియె। మ
హితహృల్లేఖ కామహామంత్రమునకు। నేవరారోహ ముఖ్యాధిదైవతంబు। సకల
జగదధీస్థాత్రియా శైలపుత్రి। విభునకిట్లని మధురోక్తి విన్నవించె॥ ఉ॥ త్ర్యంబక
యాతఁడెక్కఁడిదు రాత్మకుఁ డీయవలక్షణంబ పాం। గంబులనన్ను మాటికిని గ
న్గొను చుండ్ బహుభంగులన్వికారంబులుసూపెడుం దరతరంబయబద్ధములా
డెదుండ్ రహ। స్యంబునపీనికిట్టి చనువబ్బుటనీకృపపెంపునం జుమీ॥ క॥ నారూ
పమునకు మదిలో। నీరసపడుచున్నవాఁడు హృదయేశ్వరని। ష్కారణము వీని
చందం। బారసియెఱుఁగంగవలయు ననిపలుకుటయున్॥ వ॥ మందస్మితసుం
దరవదనారవిందుండై యిందుధరుండు ధరాధరపుత్రికిట్లనియె॥ చ॥ మనమున
యందునీ నెగులుమానుము పర్వతరాజపుత్రి నీ। తనయుఁడు నందనుల్ బహువి
ధంబుల ధార్త్యములాచరించినన్। గినియు నెతల్లి భావమునఁ గీల్పరికించిన దేవ
తావలం। బనరతిభావమైపరఁగు భావవిలాసములీవికారముల్॥ క॥ ఈకాశీ
క్షేత్రమునన। నేకాబ్దములాచరించె నీతఁడు తపము। స్తోకగుణా యీపుణ్యా। శ్లో
కునిఁగరుణార్ద్రదృష్టిఁ జూడఁగవలయున్॥ క॥ ఏవరమిచ్చెద వీనికి। నీవును వర
మిమ్ము నాకు నీకును భేదం। బావిష్కరింపవచ్చునె। యేవారికి నైనఁ బర్వతేశ్వ
రతనయా॥ వ॥ అనిపలికి పరమేశ్వరుం డాయాజ్ఞదత్తుకి యక్షకిన్నరగుహ్యక
లోకాధిపత్యంబును సఖ్యంబును నిచ్చె భవానియు॥ సీ॥ ఎడమలోచనము గుజ్జి
గ్గగసిగవ్వయుఁబోలె నుజ్జ్వలతఁ దూఁగుచునుండుఁగాక। కుడికన్ను తారకాగో
ళంబుపల్లవై యొండులోచనముతో నొరయుఁగాక। యీకుండు గృపసేసియి
చ్చినట్టివరంబు లట్లసూఁగాక నియావతిచ్చె। నాయొప్పిదమునకసూయ సే
సితిగాన నఖిధఁగు బేరుండవగుదుగాక। కాశియందీవునిలిపిన కాలకంఠ। దివ్యలిం
గంబు సర్వసిద్ధిప్రదంబు। నఖిలలోకాభివర్ణనీయంబు నిఖిల। పాపహారము
నగుఁగాక భవ్యచరిత॥ వ॥ అనిపార్వతీదేవి యతనిఁ గారవించె నిదియాజ్ఞదత్తపు
త్త్రచరితంబు॥ మ॥ ధనవంతుండగు బుద్ధిమంతుఁడగు విద్యావంతుఁడౌ సాధు
నం। దనవంతుండగు భ్రాతృవంతుఁడగుఁ గాంతావంతుఁడౌ నిత్యశో। భనవం

తుండగుఁగీర్తిమంతుండగు సత్పుత్రధాన్యవంతుండగుఁ । ధనదాధీశ్వరమాన
వోత్తముఁడు సందర్శించికాశీస్థలి॥ వ॥ విశ్వేశ్వర శ్రీమన్మహాదేవు దక్షిణ
భాగంబునఁ గుబేరేశ్వరస్థానంబునందుఁ గుబేరేశ్వరుసేవించినవారికి నణిమా
ద్యష్టైశ్వర్యంబులుసిద్ధించునని యిట్లుయాజ్ఞదత్తికి నభిమతంబులు ప్రసాదిం
చి దేవుండుదేవీసహితుండై వైశ్వేశ్వరంబైనపదంబుప్రవేశించె నీప్రకారం
బున శంభుతోఁజెలికారంబువడసి ధనదుండు॥ సీ॥ ఏపట్టణమునకు నెలదోఁట
నందనారామంబు వెలిచైత్రరథవనంబు । క్రీడావిహారదీర్ఘికయేపురమునకు
మధురామృతాంబుపుమానసంబు। మాణిక్యముకురబింబంబుకైలాసమేనగ
రివారవధూజనప్రతతికి । నేపిటిపొలిమేరయింతయంతనరాని దవ్వునందున్న
యుత్తరపుదిక్కు। పృథివితోడవైనయుప్పుట భేదనంబు। రాజధానిగఁదారకా
రాజమాళి। రాజితంబైనకృపపెంపుప్రాపుగాఁగ। రాజరాజు పేరను నేలెరాజ
సమున॥ వ॥ ఆరాజరాజురాజీవభవ హరిపురందరాదిబృందారకమకుటసందా
నితమందారమాలా మకరందబిందుధారాధౌతచరణారవిందు మందరాచల
మంథానమథ్యమాన దుగ్ధజలధిగర్భావిర్భూత కాలకూటకృపీటభవపిండగం
డూపాకశంకిత కంఠమూలోపకంఠకంఠోక్తభువనరక్షాదాక్షిణ్యదాక్షాయ
ణీకుచకలశపాళికేళి కస్తూరికామకరికాముద్రాభిముద్రితోరశ్కవాటుఁ బశ్య
ల్లలాటుఁగుటిలసుధామయూఖ శకలవిచికిలకలికాకల్పితావతంసుఁ బాంసు
క్రీడాపరిచయపేశలంబగు శైశవస్నేహానుబంధంబునంబోలె నిరభిసంస్నేహ
బాంధవంబునభజియించునది యక్షాధిపలోకస్వరూపంబీయాఖ్యానంబు స
ర్వపాపహరంబింకనీశానలోకస్వరూపంబువివరించెదమాకర్ణింపుము॥ గీ॥ అల
కయాపులమహాహ్లాదయమనుపురంబు । బ్రాహ్మణోత్తమయీశానురాజధా
ని। యదిదునుఁద్రుజశైకసాదాదులయిన। పదురునొక్కండ్రురుద్రులుపారి
షదులు॥ సీ॥ ఫాలభాగములనంబకములందఁజికిని నవతంసశశిరేఖలందఁజికిని।
డమరుఖట్వాంగఖేటకములందఁజికిని హస్తిచర్మపుటంబులందఁజికిని । శ్యామ
కంఠప్రదేశంబులందఁజికిని నాపవాహ్యావృషంబులందఁజికిని। బవమానభుక్క
లాపంబులందఁజికిని నాపాండు దేహంబులందఁజికిని। నందఁజికినగ్నితాపతప్తార
కూట। పాటలచ్ఛాయఘనజటాబంధనములు । దేటఁగొనఁజూడుమీశాను
దిక్కునందు। బ్రాహ్మణోత్తమరుద్రులుపారిషదులు॥ వ॥ ఇందు నానందకాన
నంబునందు నీశానదేవుదివ్యలింగంబుప్రతిష్ఠించి యారాధించి తత్ప్రసాదం
బున నీశానదిక్కునందు శాశ్వతంబైనయైశ్వర్యమొందువారు ॥ గీ ॥ కాశినీ
శానదేవుశ్రీకంఠుఁగొలిచి। కాంచుమనుజుఁడుహృదయసంకల్పసిద్ధి। కాశికా

క్షేత్రమష్టదిక్పాలకులకు। గామనావాప్తిసంకల్పకల్పతరువు ॥ వ ॥ అనినవిని
యనంతరంబ కొంతదవ్వరిగి శివశర్మయిట్లనియె॥ సీ॥ ఆవేశచూర్ణంబులఖి
లేంద్రియములకు శృంగారరససముజ్జీవనములు । శంబరాంతకభుజాజయకీర్తి
మహిమలు కోకదంపతికిదృక్కూలశిఖలు । బ్రహ్మాండపురవీథిరత్నతోరణ
ములు యామినీకర్పూరహారలతలు। నీరదాధ్వాంభోజినీబిసాంకురములు కు
ముదకాననములకూర్పుచెలులు। గరళకంఠాట్టహాసంబుగర్వరేఖ। కైటభా
రాతినవనాభికమలశోభ। చంద్రికలుగాయుచున్నదిసాంద్రలీల । భువనమిది
యెద్దిపరమభాగవతులార॥ వ॥ అనినఁ బుణ్యశీలసుశీలురిట్లనిరి॥ చ॥ మధురా
పట్టణవిప్రముఖ్య శివశర్మదేవశాస్త్రిగమాం। బుధిచంద్రోదయచంద్రలో
కమిది యాప్రోలేలుచుండుంగళా। నిధియాత్మీయమయూఖకందళశిఖా ని
ష్యూతధారాసుధా। విధులఁ భానుగభస్తి తప్తమగు నీవిశ్వంబురక్షించు
చుఁ॥ వ॥ సర్గాదియందుశతానందుండు నేత్రంబులను మరీచిహృదయం
బునభృగువుశిరంబున నంగిరసునుదానంబునఁ బులస్త్యువ్యానంబునఁ బుల
హునపానంబునఁ గ్రతువుఁబ్రాణంబున దక్షు శ్రోత్రంబునసత్రి సమానంబు
న వశిష్ఠుసంకల్పంబునధర్ముసృజియించె నందునత్రియనుమునీశ్వరుండు॥ క॥ త్రి
సహస్రదివ్యవర్షములు। లసదృశధృతినాచరించెనాతఁడుదపముఁ। విసుమా
నమతని తేజో। రసపూరము నెగసెబ్రహ్మరంధ్రము మోవఁ ॥ సీ ॥ బ్రహ్మరం
ధ్రముమోవఁ బారియయ్యిందిరియ దరివనోడిగిల్లెనేత్రములలోన । నేత్రగో
ళంబులునిండంగఁబర్వియా వీర్యంబుగలధాతవిమలకాంతిఁ । బదిధారలై సా
తెఁబదిదిక్కులందును సమరాపగానిర్ఝరమునుబోలె । స్రవియించుచున్న
యాచరమధాతురసంబు ధరియించిచూలయ్యెదశదిశలును। నెలలుతొమ్మి
దిమోచిదిక్కాంతలుగఠోర। గర్భలై సూతిమాసంబుగదియుటయును। సర్వభా
రంబుభరియింపశక్తిలేక। వ్రాలెభూమండలంబుపైపడఁకివడఁకి॥ వ॥ ఆదిగ్దేవత
లగర్భంబునసుద్భవించిన తేజంబేకీభవించిచందురుండై యఖిలజగద్ధితార్థం
బయ్యొరవిందభవునాజ్ఞనతనిదివ్యస్యందనంబెక్కి యష్టాదశద్వీపంబులం జరి
యించితనకుందానవృద్ధిఁబొందె నతని తేజోనిస్సరణంబునసకలజగదుపకారంబ
గునదీనివహంబుద్భవించెనట్లువర్తించి యాసుధాకరుం డవిముక్తస్థానంబున
నమృతలింగముమునీశ్వరుండుజంద్రమౌళింబ్రతిష్ఠించి యమృతోదంబనుకుం
డంబునిర్మించి తత్సమీపంబునబహుదివ్యవర్షంబులుదపంబుచేసి యద్దేవు
నిపరిసాదంబుననోషధీతోయంబులకునగ్రిజన్ములకురాజయ్యె నమ్మహాదేవు న
నుగ్రహంబునన వెండియు నాశైవాత్ర్యకుండు॥ ఉ॥ ఏటికిఁదానకంబయిన యి

తుశీరాసనవైరిజూటికా। కోటికిమల్లికాకుసుమ గుచ్ఛము లేవవహించుఁగ్రైకొనుఁడు। బాటలిమంబు మాసపరిపాకవినోదనవేళఁ బార్వతీ। పాటలగంధిచారు పదపద్మనఖంబులకొత్తలత్తుకల్ ॥ గీ॥ రాజరాజయిపాలించెరాజసమున। వసుధయెల్ల నేకాతపవారణముగఁ। గాశికాక్షేత్రమునఁ బెద్దగాలమేనిఁ। దపము చేసినబహుళభేదంబువారయ ॥ వ॥ అతఁడుహిరణ్యగర్భబ్రహ్మత్రిభృగువు లుద్విజులుగాహరిసదస్యంబుగారజనీకుహూద్యుతిపుష్టిప్రభావసుకీర్తిధృతిలక్ష్ములనం దొమ్మండ్రుధర్మపత్నులతోడంగూడి యుమామహేశ్వరప్రీత్యర్థంబు రాజసూయాధ్వరంబునొనర్చి యవార్యంబైనయౌదార్యంబున॥ ఉ॥ దక్షిణయిచ్చెముజ్జగము దానగుణప్రవరుండతండుఫా। లాక్షునిసన్నిధిన్ మఖసమాపనకాలమునందుఁదారకా। ధ్యక్షుఁడుకాశికాపురమునందుసదస్యులకున్ ప్రసాదసం। రక్షితసర్వవిష్టపుఁడు రాజపవిత్రవిరాజమానుఁడై॥ గీ॥ ఇందుకుండంబు కెలనఁజంద్రేశునొద్దఁ। గాశిలోపలసవిముక్తకంఠసీమఁ। దపము చేసినచోటనధవళకిరణుఁ। డాచరించెనురాజసూయాధ్వరంబు ॥ వ॥ ఇట్లురాజసూయాధ్వరంబు చేసిన సుధాకరు నవభృథస్నానాంతరమున॥ సీ॥ సకలలోకాహ్లాదసంధానహేతువై వెలయునీకౌముదీవిభ్రమంబు। వర్తింతుసీపునామూర్తిభేదంబులం దోకమూర్తివైసముద్రోదయమున। శ్రీకాశిలోఁబ్రతిష్ఠించినాఁడవునన్నుఁ జంద్రేశ్వరుండనుసంజ్ఞఁగూర్చి। బ్రహ్మాదత్తంబైనరథమెక్కియవలీలఁ దిరిగియష్టాదశద్వీపములను। నాహరించితిరాజసూయాధ్వరంబు। దత్పరత్నమాఁదైత్రైలోక్యదక్షిణముగఁ। జంద్రసీయట్టిధన్యుండు జగతిఁగలఁడె। యనుచువర్ణించెరాజఖట్వాంగపాణి॥ వ॥ ప్రతిమాసంబునఁబూర్ణిమాదివసంబున జపహోమార్చనధ్యానదానబ్రాహ్మణభోజనంబులుచంద్రేశ్వరస్థానమునఁ జేసినననంతఫలమునొసంగు నెవ్వండేనిముత్కలంబునఁ గుహూయోగంబునఁ జంద్రోదయవారినభిషిక్తుండై చంద్రేశ్వరుసందర్శించి వసురుద్రాదిత్య తర్పణంబొనర్చు నన్నరుండు పితృప్రసాదంబువడయునని పితృపితామహులాస్ఫోటింతురని చెండియు॥ సీ॥ ప్రత్యబ్దమాతిథిఁ బ్రతిజతుర్దశిసిద్ధ యోగీశ్వరీదేవి యోగపీఠి। కాధిరూఢభవాని నకళోరళశిమాళి హాటకతాటంకహారకటక। కేయూరమేఖలా కింకిణీకంకణా ద్యఖిలవిద్యాభరణాభిరామఁ। బింగళాహ్వయన మద్బృందారకశ్రేణి నాదిభైరవశక్తి నఖిలజనని। గాళిఁజంద్రేశదేవోపకంఠనిలయఁ। జంద్రకుండోదకంబున జలకమార్చి। గంధపుష్పాదిహారాదికల్పనముల। సేవసేసినవిఘ్నంబుచేరకుండు॥ వ॥ ఇది చంద్రలోకమాహాత్మ్యం బీయుపాఖ్యానంబు విన్నసుబకియిం

చినసుజనునకాయురారోగ్యైశ్వర్యంబులు సమగ్రంబులై సంభవించు ననిన విని శివశర్మధర్మశీలసుశీలురకిట్లనియె॥ గీ॥ భాగవతులార భాగ్యసంపన్నులార। యింతయొప్పు నెయ్యడులోక మెట్టయెదుర। గగనలక్ష్మీ మలతాతన్వికబరిమీఁద। సంతరించినముత్యాలజల్లివోలె॥ వ॥ ఈలోకవృత్తాంతంబు వినవలతుం జెప్పుండనిన నతనికి వారలిట్లనిరి॥ సీ॥ సగ్రాకదిఁబర మేష్ఠిచరణంబు పెను వ్రేలదక్షుండుపుట్టె నాతనికిఁబుట్టి। రఖువంద్రుకన్యకలాకన్నియలురూపలావణ్యలీలావిలాసవతులు। రోహిణీప్రముఖలారుక్మగౌరాంగులు శివుఁగూర్చియాచరించిరితపంబుఁ। గాశిలో దివ్యలింగంబునక్షత్రేశ సంజ్ఞంబునొకప్రదేశముననిలిపి। వరణాదరియందుసంగమేశ్వరునియొద్ద। దివ్యవర్షసహస్రంబుద్రిపురవైరి। మెచ్చిపొడచూపియడుగుఁడుమీరువరము। లనినవారలిట్లనిరిగాలాంతకునకు॥ క॥ నీయట్టివాఁడుపురుషుం। డాయెడుమాకభవయనినసట్టెఁడమీరుకు। నాయకుఁడయ్యెడుననిదా। క్షాయణులకువరమునీలకంఠుండొసఁగెన్॥ వ॥ వెంశీయుసమస్తజ్యోతిశ్చక్రంబునందు నగ్రగణ్యలయ్యెదరు మేషాదిరాసులకుంగారణంబులయ్యెద రోషధీశ్వరుండు బ్రాహ్మణాధిపతియైన తారకాపతికింబత్నులయ్యెదరు మీచేతం బ్రతిష్ఠితంబైన నక్షత్రేశలింగంబు భజించువారలకు భోగమోక్షప్రదంబయ్యెడు మృగాంక లోకంబునకు మీలోకంబూర్ధ్వలోకంబుగాఁగలయదిసర్వతారకామధ్యంబునమీరు మాన్యలయ్యెదరనియానతిచ్చిశివుండంతర్హితుండయ్యెనిదితారకాలోకవృత్తాంతంబనిననవిని యనంతరంబముందటబుధలోకంబుగనుంగొని॥ సీ॥ ప్రతిబింబమో కానిరజనివల్లభునకధ్యాహారమోగాని యమృతరుచికి। వినిమయంబో కాని విధునకన్వాదేశ మోకానియత్రినేత్రోద్భవునకు। పిప్పమో కానిపూవిలుకానిసఖునకు నామ్రేడితమొకానియబ్జజునకు। నభిధాంతరమొకానియరవిందవైరికిసారూప్యమోకానిచందురునకు। ద్రుమికయూడ్చినవాఁడుభర్గునికిరీట। కోటికాభరణంబైనకువలయాప్తు। మిగులఁజక్కనికొడుకండ్రిమింటినడుమ। గ్రహములందీతఁడెవ్వండుగణములార॥ వ॥ ఈతఁడీలోకంబుసంభ్రమమయంబువిలాసమయంబు రాగమయంబుశృంగారమయంబునుగావించుచుఁ జక్షురాకర్షణసిద్ధాంజనంబున మనోవశీకరణమంత్రంబునవింద్రియావేశచూర్ణంబునఁ గౌతుకంబునకుసంతోషంబును సౌభాగ్యంబునకు సిద్ధయోగంబును మన్మథునకు జన్మాంతరంబును యౌవనంబునకు సామ్రాజ్యంబును గల్పించుచున్నవాఁడు షోడశవర్షదేశీయుండీగ్రహగ్రామణియెవ్వండనినఁ బుణ్యశీలసుశీలురుశివశర్మకిట్లనిరి॥ మ॥ వినుమధురామ

హానగర విప్రకులోత్తమ బ్రహ్మవంశవ। ధర్నశివశర్మ పుణ్యకథధర్మకథల్
పరిపాటిఁ జెప్పఁగా। వినసతిమాత్రిదూరమగువిష్ణుపదంబున కేగుచున్నచో।
మనకుఁ బథప్రయాసములు మానెడు విఘ్నములుం దొలంగెడున్॥ వ॥ ఇదిబు
ధలోకంబు॥ సీ॥ రాజసూయ మహాధ్వరం బెవ్వఁ డొనరించెఁ ద్రైలోక్య
హంతకార్యంబు గాఁగ। నెవ్వాని ప్రియభామ లిరువదేడ్వురు నలధవళాయతా
క్షులు దక్షసుతలు। మన్మథాంతకుజటామకుటకోటికి నెవ్వఁ డవతంసకుసుమ
మాల్యత వహించె। నెవ్వఁడు నలువ తే రెక్కి యష్టాదశద్వీపాళి నసివారు దిరి
గెలిలఁ। జంద్రికాపాండుకౌశేయశాటియైన। యతనుజగజంపుగొడుగెవ్వఁడ
న్విభుండు। పెద్దగాలంబు ముత్యాలగద్దె యెక్కి। వసుధఁ బాలించె నేకోష్ణ
వారణముగ॥ గీ॥ శైశవంబున శాస్త్రంబుఁ జదువవచ్చి। గురునిప్రియభామ
యనిచేయుఁ బరమభక్తి। యెవ్వ తెకుసట్టితారపూర్ణేందువదన। నాఁటనుండి
యుఁ గామిం చెనలినవైరి॥ మ॥ జడచొళ్లెంబునుబట్టుదట్టియును రత్నహాట
కాలంకృతు। ల్మెడహారంబురు మట్టివన్నెయగుచుక్క లీలావిలాసంబు పెం।
పడరం జేయఁగ సూమిసీధవుఁడు విద్యాభ్యాసకాలంబునన్। నిడువాల్గన్నులకుం
బ్రిమోద మొసఁగున్ నిత్యంబునున్ దారకున్॥ సీ॥ ఆచార్యప్రియభామయ
ని కొన్నిదివసంబు లిచ్చగింపఁడు తెప్పలెత్తిచూడ। నుల్లమువ్విళ్ళూర నొక
కొన్నిదినములు వీక్షించుఁ జూడని వేళయందు। నొకకొన్నితిథులు గర్భోక్తి
చాతుర్యంబు మెఱయ నేకాంతంబ మేలమాడు। నొకకొన్ని ఘస్రంబు లొ
క్కొక్క నెపమున నంగాంగసంస్పర్శ మాచరించు। వలచి పైఁబడు నొకకొన్ని
వాసరములు। హృదయమున రాగసంపద లిగురుకొలిపి। కవయుఁ దొడఁగిన య
దియూది గాఁగనుని చెఁ। జందురుఁడు తారశుద్ధాంత సదనభూమి॥ గీ॥ చదివె
గుసునొద్ధ ధర్మశాస్త్రంబు దొలుత। బరమవిశ్వాసతాత్పర్యభక్తిగరిమఁ। బది
వెఁ జంద్రుఁడుం కు కామశాస్త్రంబు పిదపఁ। దవిరుఁ బాన్పున నసురక్తిఁ దార
యొద్ద॥ గీ॥ ఆదిగర్భేశ్వరుండౌటయును చిత్రంబు। మిగులఁ జక్కనివాఁడౌట
మేలుగాదు। పాపమభినవయూవనోద్భాసియగుట। యరయ మంచిగుణంబుల
యవగుణములు॥ వ॥ అనినయునివానం బైన స్వాతంత్ర్యంబునను గుతూహ
లబహుళంబైన స్వభావంబునను ధైర్యప్రతిరక్షంబైన యూవనారంభంబు
నను నెవ్వని కేమనోవికారంబు పుట్టకుండు నె యుదియునుం గాక॥ సీ॥ ఘనత
రాహంకారకాలకూటపిపాసలాభీలములు గటాక్షాంచలములు। దుర్వారతర
తీవ్రగర్వగళగ్రహాకలితగాఢ్గద్యఘుఘుర్ఘురముమాట। యస్మితాసంప్రభూత
స్మయాపస్మార విస్మృతధైర్యంబు వినయగరిమ। యుద్దామదర్పభారోష్ణ

దాహజ్వరారంభసంభృతవికారంబుమనసు। చరణచంక్రమ మభిరామసన్నిపాత। సరణిసర్వాంగభంగంబుజనపతులకు। భూభుజులతప్పె యదివారిఁబొందియున్న। ధరణిసామ్రాజ్యభూతంబుతప్పగాక॥ సీ॥ భువనైకధన్వి చేఁబుష్పాయుధునిచేతఁ బ్రసవాస్త్రమున నేటువడనివాఁడు। నతిగాఢమైనక్రోధాంధకారంబునఁ గన్నులనంధుండుగానివాఁడు। నిర్బంధనలోభనిద్రాభరంబునఁ బారవశ్యంబుచేఁబడనివాఁడు। లక్ష్మీకటాక్షవిలాసదుర్మదమున మనములోపలనన్ను కొననివాఁడు। లేఁడుభూపతిగలిగెనే వాఁడు నృపుఁడె। విశ్వధాత్రీజనులపాలివేల్పుగాక। బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు। నంతరరులనుపర్జింపనలవిగాదు॥ వ॥ అదియట్లుండెఁ దదీయవృత్తాంతంబు వినుమనియిట్లనియె॥ గీ॥ తాల్చెగర్భంబు దారసుధాకరునకుఁ। గువలయేక్షణరాగంబుగొనలుసాగఁ। జంభరిపుదిక్కుప్రత్యూషసమయమునను। దామరసబంధుగర్భంబుదాల్చినట్లు॥ గీ॥ గర్భసంస్థితుఁడగు గ్రహాగ్రణివిశుద్ధ। స్థితయశస్స్ఫూర్తి వెలిఁబ్రకాశించెననఁగ। దారమైదీఁగవికచలోధ్రప్రసూన। పాండురచ్ఛాయనొయ్యొయ్యఁబలుకఁ బాఱె॥ గీ॥ గర్భసంస్థితసద్గుణగౌరవమునఁ। బోలెగాత్రంబుభరియింపఁజాలదయ్యె। నమృతధారారసాస్వాదసముపజాత। తృప్తియనుబోలెనాహారతృష్ణవదలె॥ శా॥ ప్రత్యుత్థానము సేయుఁ బెద్దలకు నాప్రాణేందుబింబాస్యయు। ప్రత్యాహస్థిరభక్తిభారమునఁ దోరంబైనగర్భంబుచే। నత్యంతాలసయయ్యు నగ్గురుజనంబందంద వారింపఁగాఁ। బ్రత్యాసన్నసఖీసమర్పితకరాబ్జాతావలంబంబునన్॥ క॥ అంగనయొక్కొకమత్రియు। త్తుంగమణిస్తంభయష్టితోనొత్తగిలున్। మంగళభవనాంతరమున। బంగారుమెఱుంగుసాలభంజికపోలెన్॥ ఉ॥ బింబఫలాధరోష్ఠిమణిభిత్తిపుటంబులయందునాత్మబిం। బంబుగరావలంబనసమర్థముగామదిఁగోరుఁగేలిసౌ। ధంబుపర్యంకసమున్నతనితంబపయోధరభారగర్భభా। రంబునఁగోమలాంగకమురాట్పుడఁగేలివిహారవేళలన్॥ గీ॥ భవనశృంగారవనలతాపల్లవములు। సబలకైదండపట్టుటయద్భుతంబె। విహృతసౌధమణిస్తంభవిస్రమరాంశు। కందళులనూఁతగొనఁబోవుగర్భగరిమ॥ గీ॥ పనులువంపంగఁజాలదు ప్రాణసఖుల। భవనకార్యప్రవృత్తికై పద్మనయన। తానుగర్భభరాలసత్వంబుకతనఁ। జేయజాలదుమఱి వేఱచెప్పనేల॥ మ॥ అటమున్నెక్కుడుకేలిశైలమున నత్యారోహణంబాచరించి। చుటకై నెచ్చెలికత్తియల్ నగుచు సంసూచించినన్ గాంతయొ। క్కటసంతాప్రసమునొందుఁ జన్నుఁగవయాకంపింపఁగానిందువేఁ। కటిభారంబునఁ జేసిధీరహృదయుల్ గారాదిగర్భేశ్వరల్॥ వ॥ అంతనటబృహస్ప

శివపత్నీవియోగవేదనాదూయమానమానసుండై చంద్రుండు చేసిన యపరాధంబు హరిహరహిరణ్యగర్భులకు. నింద్రాదిసురులకు నెఱింగించిన॥ సీ॥ తగవుగాదని యెమునతనముండిపృతాత్రి యనుచితంబని యెహుళాశసుండు। పాతకంబని చెప్పి పలికె దండధరుండు దౌరాత్మ్యమని యెను దానవుండు దుష్కర్మమని చెప్పెం దోయాధినాయకుం డపకీర్తి యనితూలనాడె గాలి। యన్యాయమనియె గుహ్యకసార్వభౌముండు గాదుగాదనియె శాక్కరగమనుండు। హేతుదృష్టాంతములు చూపి రెల్లసురలు। నన్వయవ్యతిరేకమార్గానువృత్తి। బుద్ధిం జెప్పిరి యెవ్విధమున శశాంకుం। డమరగురునకుమగుడ నీండ యోందార॥ అంత॥ చ॥ ప్రమథులతోడంగూడ నతిభైరవ ఘోరతరాట్టహాసుండై। శమనవిరోధి దాంకుటయుంజంద్రుండు వేల్పులతో నెదిర్చిన। న్సమరము దారకామయమనంగ నభోంగణభూమిం దారకా। సముదయభీతి హేతువయిసాగెంబురారికినబ్జవైరికి॥ గీ॥ ఈశ్వరునితోడనని సేయు నెట్లువచ్చు। నన్యులకు నెంతవారికి నాగ్రహమున। నీశ్వరునిమూర్తి గావున నెదిరినిల్చి। యుద్ధమొనరించెం గాక యనుష్ణకరుండు॥ అప్పుడు॥ శా॥ చండీశుం బొందివెన్నిశాకరుం డవష్టంభంబుజృంభింపంబ। హ్మాండక్రోడము శింజినీధ్వనులచే నాఘూర్ణనంబొందను। చ్చండాటోపభుజావలేపకలనా సంరంభ చక్రీభవ। ద్గాండీవప్రవిముక్తభీషణమహాకాండ ప్రకాండంబులన్॥ వ॥ ఇవ్విధంబున బ్రతిఘటించి గెంటి పరాని మగంటిమిం బెచ్చువెరిగికలువల నెచ్చెలి చిచ్చులుమియు శిలీముఖంబులొడలం గ్రుచ్చియార్చి శంఖంబుపూరించి సింహనాదంబు సేసి గాండీవజ్యారావంబురోదసీకుహరంబునిండ దండమహాకాళ నికుంభ కుంభోదర వీరభద్రాదిప్రమథవర్గంబుతోడంగూడం దన్నునొప్పించినం గోపించి కించిదారజ్యమాన లోచనాంచలుండై లలాటలోచనుండు పురనిశాటతాటంకినీ కపోలకస్తూరికాపత్రమకరికామంద్రా ద్రోహియు జలంధరహృదయ గర్వసర్వంకషంబును సింధురాసుర శిరశ్శికూటపాకళంబును దక్షాధ్వరమృగధ్వంసనక్రీడానృశంసంబునుదుహారగిరికన్యకాభ్రూవల్లీ విలాసరేఖాలలితశృంగంబును నగుసజగవంబున బ్రహ్మశిరోనామకంబైనదివ్యాస్త్రంబు సంధించిన॥ శా॥ ఆకంపించె జగత్త్రయంబు దెసలల్లాడెన్ సముద్రంబులు। ద్రేకించెన్ భయమందె భూతలము భేదిల్లెన్ మహీధ్రంబులున్। శ్రీకంఠుండవికుంఠవిక్రమమునన్ దివ్యాస్త్రముం గూర్చి విల్లాకర్ణాంతముగా వెసందివిచి శీతాంశున్నిరీక్షించుడున్॥ గీ॥ అప్పుడడ్డంబుసొచ్చి పద్మాసనుండు। పరిమథనాథునిరోషసంభ్రమము మాన్పి। చంద్రునికిబుద్ధిం జెప్పినుాత్సర్యముడెపి। యాలినిప్పించె నయ్యుచథ్యా

సుజనకు॥ చ॥ అమృతమయుండుగావున సుధాంశునితోడిసమాగమంబునన్।
రమణికి శుద్ధిలేదనుచు బ్రహ్మహరీశులు సంఘటింపఁగా। సమరగురుండు పైకొని
యొసంబుజలోచనఁ దారఁ దారకా। రమణముఖంద్యజం బెను సురాజను ఖ్యాతి
నినట్టికేళనన్॥ వ॥ అనంతరంబ గర్భంబాలోకించి గురుండు దానికిట్లనియె॥
గీ॥ అతివ యీగర్భమెవ్వరి కైతి చెపుమ। చంద్రునికొ నాకొ యనిరహస్యమున
నడిగె। సిగ్గువడి యెంతయడిగినఁ జెప్పదయ్యె। నాంగిరసునకుఁ దారతారాధిపా
స్య॥ గీ॥ చెప్పకున్నఁ గోపించి యుపేక్షయెత్తె। చూలుగరఁగంగనై వంగఁజూచె
గురుఁడు। వేల్పురాయిండుముఖి చూచి వెఱకి చెప్పు। నిజము చెప్పిన నీకు నే నె
గులు లేదు॥ ఉ॥ నావుఁడు దారయొక్క వచనంబును బల్కక యూరకుండె నల।
జ్జావనతాస్యయై సరసిజాసనుఁడప్పుడు చేరవచ్చి యో। దేవి నిజంబు చెప్పుమిమ
దీధితి సంగతినైన గర్భమో। జీవుఁడు దొంటికాలమునఁ జేసినఁ గర్భమొ యంచు
బల్కినన్॥ గీ॥ తోయజాతదళాక్షి కేల్దోయి మొగిచి। పలికె నెత్తమ్మిచూలి
తోఁ బ్రస్ఫుటముగ। వనజసంభవ తారకావల్లభుండు। చూలు చేసినవాఁడంచు
సూక్ష్మఫణితి॥ వ॥ గురుండును దారకు జన్మించినట్టి కుమారుని జంద్రునికిచ్చె
జంద్రుండు నిజనందనునకు బుధుండను పేరు వెట్టె బుధుండును దండ్రియనుమతివ
డసి కాశికరిగి బుధేశ్వరుండను లింగంబు ప్రతిష్ఠించి పెద్దగాలంబు తపంబు చేసి
యా బుధేశ్వరలింగంబునందు సాక్షాత్కరించిన విరూపాక్షుం బ్రస్తుతించి
యమ్మహేశ్వరువలన నక్షత్రలోకంబునకునూర్ధ్వంబుననున్న యీలోకంబున
కధీశ్వరుండయ్యె॥ గీ॥ చంద్రకుండ చంద్రేశ్వరస్థానమునకుఁ। బ్రాగ్దిశాభా
గమునయందు భక్తివరుఁడు। గాశికాక్షేత్రసీమ బుధేశుఁ గొలిచి। పరమరో
ధంబవప్పుడు ప్రాణవిరతి॥ గీ॥ అనుచు గోవిందకింకరులనఘమతులు। బు
ధునికథ చెప్పుచుండ సంభోదవీథి। బోయె దివ్యవిమానంబు పుణ్యకర్మ। కరుల
నెలనై సశుక్రలోకంబు డాయ॥ వ॥ అప్పుడయ్యిద్దఱు శివశర్మకిట్లనిరి నిశిత
శతక్రతు ప్రయోగ ప్రక్రియాక్రమసమర్థ శుక్రలోకం బిది యిందు దానవగు
రుండు గావ్యుండధివసియించు నా భార్గవుండు భర్గువలన వర్షసహస్రంబు కణ
ధూమంబాహారంబుగా దుస్సహంబైన తపంబాచరించి మృతసంజీవనీవిద్యార
హస్యంబును సకలంబుగా నెఱింగినాఁడు॥ గీ॥ ఎఱుఁగరీవిద్య నెవ్వారు నిజ్జ
గమున। బ్రహ్మసంశాగ్రగణ్యావాక్పతి మొదలుగ। గుహుఁడు దక్కంగఁ గరటి
వక్త్రుండు దక్కఁ। బార్వతీదేవి దక్కంగ భవుఁడు దక్క॥ గీ॥ హరునితోడ వి
రోధించి యుద్ధకుండు। యుద్ధమొనరించుచో నొక్కనాఁడోహటించె। నజగవో
న్మత్తఘననిశాతార్ధచంద్ర। బాణనిర్భిన్నవక్షఃప్రపాతుఁడగుచు॥ వ॥ కాల

కంధరునకునంధకాసురునకు నైన యమ్మహాయుద్ధంబున నీల్గిన రాక్షసులను మృ
తసంజీవనీ విద్యాప్రభావంబున భార్గవుండు బ్రతికించుచుండ దండనికుంభ
కుంభోదర ప్రముఖులగు ప్రమథులు పరమేశ్వరునకిట్లనిరి ॥ సీ॥ దేవమహాదే
వ త్రిపురదైత్యధ్వంస యుభవమావిన్నప మవధరింపు । మీచేతఁబడసినమృ
తజీవనీవిద్యఁ బ్రతికించుచున్నాఁడు భార్గవుండు । దైత్యవర్గము నెవ్విధంబున
మాకిట్లు జయముసిద్ధించునాఁ జంద్రహాళి। నందికేశ్వరుఁ బంచి బందిగ్రహణాలీ
లఁగావ్యఁ జెప్పించి శ్రీకంధరుండు। గరతలముసఁ బదరిపండు కాంతినతని। దా
ల్చి దధిత్తోడి చలిదిముద్దయును బోలె । విషము మ్రింగిన పెన్నుద్ది వేల్పుఱేఁడు।
మనసిజారాతి మ్రింగిగబ్బినఁ గఁద్రేపె॥ వ॥ అంధకాసురుండును భార్గవుండు
లేనివిస్మాటంగొంత కాలంబునకుఁ గృతాంతదమను చేత హతుండయ్యె బహు
కాలంబు కాలకంఠుజఠరగోళంబునందుండి కావ్యుండును॥ మ॥ స్రవియించెఁ
దుహినాంశుశేఖరుని మేఢ్రద్వారమార్గంబునన్ । గవిశుక్లంబయితత్ప్రసంగం
బున నిజాకారంబు దాల్చె న్మనో। భవవిద్వేషి నిజాత్మసంభవునిగా భావించి పీ
డ్యోత్కల్చెభా। గవునాతిండుదపంబు సేయనరిగెం గాశీపురీసీమకున్॥ వ॥ అరిగి
యానందకాననంబున లింగప్రతిష్ఠసేసి యాలింగంబునందు విశ్వేశ్వర శ్రీమన్మ
హాదేవు భావించుచుఁ జంపక దుత్తూరకరవీరకుశేశయమాలతీకర్ణికార కదంబ
వకుళోత్పలమల్లికాశతపత్రసింధువార కింశుకాశోక పున్నాగనాగకేసరక్షుద్రా
మాధవీపాటలాబిల్వమందార ద్రోణ గంధిపర్ణ దమన చూతపల్లవదర్భతుల
సీనంద్యావర్త దేవదారు కాంచన దూర్వాంకురాదుల శంకరునసేకకాలంబా
రాధించి శుక్రుండీలోకంబున కధీశ్వరుండయ్యె॥ క॥ వారాణశిశుక్రేశ్వరు । నా
రాధించినసరుండు ప్రాపించుసమ। గ్రారోగ్యాయుఃపుత్రశ్రీరాజ్యైశ్వర్యశౌ
ర్యచిరసౌఖ్యంబుల్॥ వ॥ అట్లనూర్ధ్వంబుననున్న యదిలోహితాంగలోకంబు॥
సీ॥ తొల్లి దాక్షాయణితోఁ బాసి శంభుండు విరహసంతాపాగ్ని వేఁగుచుండె। నా
వేళనొక్కనాఁడ భవుఫాలంబునఁ బ్రస్వేదబిందువుత్పన్నమయ్యెఁ । బరిపక్వ
కూశ్మాండఫలసన్నిభంబైన యాఘర్మజలకణంబవని వ్రాలె । వ్రాలితత్క్షణ
మయవస్సుమతీస్థలమునఁ బద్మరాగోపలప్రతిమకాంతి । నొక్కడివ్యకుమా
రుఁడై యుండెనెమర। సతివినందనుఁగా శంభుఁడాదరించె। ధాత్రియును వాని
భావించెఁ బుత్రుఁగాఁగ। సతిఁడు ప్రీతినిదపము సేయంగఁ గోరి॥ సీ॥ భాగీరథీగం
గ ప్రవహించు నేవీటి పరిసరంబుననుదగ్భాగమునను। వరుణాతరంగిణీ వార్నిర్ఝ
రములతో నెలివేణి యేవీటియవధిఁ గూడెఁ । దత్తంబుహుతమును దత్తంబు నేవీ
టిమైదుగ్రోసులనిచ్చునమృతలక్ష్మి । వలచు నేవీటికవ్యాజరాగస్ఫూర్తినై

లోకస్యైకకంఠుఁడుచంద్రమౌళి। యట్టి కాశికి గుర్వాజ్ఞ నరుగుదెంచి। పరమనైష్ఠికుఁ డగుచుఁదపంబొనర్చెఁ। గలుషనంతానకాననానంగారకుండు। దారకుఁడుభూతధాత్రికంగారకుండు॥ గీ॥ పాంచముద్రమహాస్థానపథమునందుఁ। గంబళాశ్వతరేశోపకంఠభూమి। నిష్ఠనంగారకేశుఁబ్రతిష్ఠసేసి। కాంచెనీలోకమేలనంగారకుండు॥ వ॥ ఇదియంగారకలోకవృత్తాంతంబు॥ క॥ అదెవీక్షింపుబృహస్పతి। సదముధరామరవరేణ్యబహువిధశుభసం। పదలకునాస్పదమీతఁడు। చదివినవాఁడర్థశబ్దశాస్త్రమఖిలమున్॥ వ॥ అయ్యాంగీరసుండు గాశీక్షేత్రమునకరిగియుండుఁదనపేరశంభులింగంబుఁ బ్రతిష్ఠించి తత్సమీపంబున బహుదివ్యవర్షంబులుదపంబుసేసె తనకుంబ్రత్యక్షుండైన విరూపాక్షునిట్లనిసంస్తుతించె॥ తోటకవృత్తము॥ జయశంకరశాశ్వతచంద్రధరా। భయనాశగిరీశ్వరభక్తిపరా। నయనత్రయభాస్వరనాగహరా। జయవర్ధనశాంతదయామధురా॥ తోటకవృత్తము॥ భువనావనపావనభూతిపతీ। భవపన్నగభూషణభద్రకృతీ। శివదేవమహేశవిశిష్టమతీ। భవభంగఫలప్రదపాపహృతీ॥ తోటకవృత్తము॥ శ్రితపాపవిభంజనసిద్ధనతా। క్షితిభృత్తనయాధరచిద్విదితా। మృతిజన్మవిధూతహరిప్రణుతా। సతతప్రణవధ్వనిసాధరతా॥ క॥ చాటుకవితాకళాపఁ। పాటింపాటించియారభటిభక్త్యావే। శాటోపంబునఁగీష్పతి। తోటకవృత్తములబొగడెఁ దుహినాంశుధరున్॥ శా॥ ఆటోపారభటిన్మునీశ్వరుఁడు దన్నందందవర్ణింపఁదఁ। జ్చాటుప్రౌఢికిఁజేసెధూర్జటిమహాశ్లాఘాశిరఃకంపమున్। జూటీకూటవిటంకకోటి విలుఠత్స్రోతస్వినీవీచికా। కోటీధాటిరలత్కరోటికుహరక్రోడావకాశంబుగాన్॥ వ॥ ఇట్లుప్రీతుండై॥ సీ॥ బృహదుగ్రతపముసంభృతనిష్ఠఁజేసిన సామర్థ్యమునబృహస్పతివిగమ్ము। ప్రాణంబుప్రాణమై భక్తిఁజేసితిగాన జీవాహ్వయమునీకుఁజెల్లుఁగాక। వాగ్డంబరమునఁగైవారంబు సేసితి దగునువాచస్పతిత్వమునకీవు। పఠియించువారికిఁబ్రాతిభస్ఫురణంబు దొరకించునీచాటుతోటకములు। లోహితాంగుఁడుపాలించులోకమునకు। నూర్ధ్వమైనపదంబునసుండువత్స। యనుచువరములుగృపచేసియసితగళుఁడు। బ్రహ్మాదులఁ జెను దేవతాప్రతతితోడ॥ వ॥ సంస్మరణమాత్రంబున నేగుదెంచిన బ్రహ్మాదిదేవతలచేతనవ్వాచస్పతికిదేవతాచార్యపదవీ సామ్రాజ్యంబునకుం బట్టాభిషేకంబుచేయించి యప్పంచాననుండు చంద్రేశ్వరునికి దక్షిణభాగంబున విశ్వేశ్వరునికినిర్‌ఋతిభాగంబున ధిషణుండుప్రతిష్ఠించినధిషణేశ్వరునియందు సంక్రమించె గురుండునునీలోకంబునకధీశ్వరుండయ్యెనిదిబృహస్పతిలోకవృత్తాంతంబు॥ గీ॥ దివిజగురువిష్టపంబునతిక్రమించి। సౌభువనంబుగాంచియాశ్చర్య

మంది। పుణ్యశీలుండు శివశర్మ పుణ్యశీలు। నకు సుశీలునకిట్లనెం బ్రకటఫణితి॥ ఉ॥
పాండురపద్మలోచనుని పార్శ్వగులార మహాత్ములార మా। ర్తాండసమానులా
రయి దేహప్రాంతమునందు సముజ్జ్వలప్రభా। మండలమధ్యవర్తియు సమగ్రవి
లాససమన్వితంబునై। రెండవనాకలోకమనదృష్టికినింపొనరించె నెంతయున్॥
వ॥ ఇది యెవ్వరి లోకంబనిన వారలిట్లనిరి॥ గీ॥ సంశితవ్రతియిది శనైశ్చరునిలో
కమిత్తఁడుగ్రహములలో నెల్ల నతిబలిష్ఠుఁ। డిమ్మహాత్ముని శుభచరిత్రమ్ము విను
ము। విశదముగఁ జెప్పెదము నీకు విస్తరించి॥ సీ॥ నారాయణుని నాభినలినమ
ధ్యంబున జనియించె బ్రహ్మ యావనజజునకు। సంభవించె మరీచి సంయమిగ్రామ
ణి గలిగె నమ్మౌనికిఁ గశ్యపుండు। ప్రభవించె నాకశ్యపప్రజాపతికి మార్తాండుఁ
డబ్జాప్తుండు త్వష్టకూఁతు। సంజ్ఞాభిధానరాజనిభాస్య వరియించె దరణికిని దియ
పత్యత్రయంబు। గాంచె మనువనయముఁడనఁ గాఁదనయుల। యమునయను క
న్యకను గాలమప్పురంధ్రి। యోర్వలేదయ్యె మగని యత్యుష్ణమైన। తేజమునక
తివకోమలదేహయగుట॥ గీ॥ ఛాయయను ధానిసృజియించె సంజ్ఞ యొక్క।
మానినీమణి నాత్మ సమానమూర్తి। నగ్రమునయందుఁ బ్రాంజలియగుచు నుం
డె। నది ప్రతిచ్ఛాయ లలితమాయాస్వరూప॥ వ॥ సంజ్ఞాదేవి సువర్ణయగు నా
ఛాయ కిట్లనుఁ గల్యాణి యేఁ బుట్టినింటికిం బోయెద నీవు మదీ
యాజ్ఞ సూర్యునికిం బరిచర్య సేయుము మనువును యముండును యమునయును ను
నపత్యత్రయంబు నీయది గాఁదలంపు మీరహస్యంబు కచగ్రహణాశాపపర్యంతం
బెవ్వరికిం జెప్పకుమని యప్పగించి పితృగృహంబునకుం బోయె నిట్లు సువర్ణయు॥
గీ॥ అష్టముండగు సావర్ణియనెడు మనువు। మఱి శనైశ్చరు భద్రానమాఖ్యఁగ
న్యక॥ గాంచె నుష్ణాంశువలన నక్కలువకంటి। తరణియును దానిసంజ్ఞగాఁ దలఁ
చియుండె॥ వ॥ అసువర్ణయు సర్వస్త్రీస్వభావంబగు సాపత్న్యగుణంబున సంజ్ఞా
సంతానముకంటెం దనసంతతియందు నత్యంతవాత్సల్యంబు వాటించి భోజనా
లంకారలాలనంబుల పట్టుపైపమ్యంబు గలిగియుండ నొక్కనాఁడు భవితవ్య
తావిలాసంబుననో బాల్యచాపలంబుననో కుమతాస్వాతంత్ర్యంబుననో జ
ముండు సంజ్ఞారూపిణియైన పినతల్లి ఛాయాదేవిం గోపించి తన్నందలంచి పా
దంబెత్తిన॥ సీ॥ తనకు సంజ్ఞాదేవి మనములోఁ గడు సమ్మి యిల్లడ వెట్టుట యె
ట్లు మఱచెఁ। బసిబిడ్డ నేరమిపట్టి పాలార్పంగఁ దగవు గాదని యేల తలఁపదయ్యె।
దానేమి బిడ్డలఁ గాన దాసవతాలికొడుకు తప్పొకటిలోఁ గొన్న నేమి। యల్పదో
షంబునకనను రూపంబైన ప్రబలదండంబొనర్పంగఁ దగవె। జముఁడు దన మీఁదఁ
బాదంబు చాఁచినపుడు। కనికరంబింత లేకయక్కలువకంటి। కంటికోపన గెంపు

గనురంగఁగవలిచూచి । పదముదెగిపడశపియించెబాలునలెని॥ వ॥ అవ్విధం
బెఱింగిభానుండు ఛాయాదేవింజూచి యిట్లనియె॥ గీ॥ ఎట్టియపరాధమొన
రించెనేనీఁదల్లి। కొడుకుశపియింపదిభ్ఛంగిఁగ్రూరబుద్ధి । సతివసత్యంబు చెప్పు
మెవ్వతవునీవు । నావుడును శాపభీతిఁవన్నలిననేత్ర॥ వ॥ తనవృత్తాంతంబు చెప్పి
నదానియందపరాధంబుపొడగానకయమునింజూచి మాతృశాపంబునివర్తింం
పశక్యంబుగాదు నీచరణంబునంగల మాంసంబు కృమికీటంబులు దొలిచిభ
క్షింప భూమిపైఁబడియెడుననిపలికి కొడుకునూఱడించి త్వష్టప్రజాపతిభవ
నంబునకుంబోయిఁయాతనివలననిజభార్యాదపంబు సేయంజనుటయు నున్నగుఱు
తును నెఱింగియుగ్రభోగంబున॥ సీ॥ కఠినరింఘాపుటీఘట్టనంబునభూమి వట
మానిధ్వానంబుప్రస్తరింప । ధవళలాంగూలపల్లవచాలనంబులు కౌముదీచ్ఛా
యలఁగ్రాసియుమియ। వెలిదామరలఁబోలు వెడఁదకన్నులయందుఁదారంబు
లలరచందమువహింపఁ । బ్రోథసంపుటపరిస్ఫురణావసరముల దంతకోరక
కాంతిదళుకుచూపఁ । గొదమగోడిగయైకుటుక్షోణియందు । విపినవీథులనే
కాంతవృత్తిఁదిరుగు। పరమపుణ్యాంగనాజనప్రమథగణ్య। సంజ్ఞఁబొడఁగాంచె
దవ్వులఁజండకరుఁడు॥ ఉ॥ ఘోటికయైచరించుతనకూరిమిభామినిఁజూచిదవ్వు
లన్। ఘోటకరూపుఁడై యతఁడు క్రొవ్వెనలారెడు కాపురంబుపై । పాటున
డాయవచ్చెనిరుపాధికసౌహృదవిభ్రమంబునన్ । జీటికిమాటికిన్ దెసలుచిల్లు
లుపోవఁగఁజేసె హేషలన్॥ గీ॥ అశ్వరూపుఁడైనయరవిందబాంధవుఁ। డశ్వ
యైనసంజ్ఞ వల్లఁజేరి । కాపురంబుతోడికందర్పవిక్రీడ । మోరమోరమోపి
మూరుకొనియె॥ వ॥ ఇవ్విధంబున సాక్షాత్కరించినతపోలక్ష్మియుం బోలె
సబ్బడబబడబానలజ్వాలాజాలలీలాపీడావహామహఃపటలపాటలిమపల్లవిత
దశదిశాభోగభోగింపందలంచి పూషవిషమబాణుచిట్టంబుననకఠోరదూర్వాం
కురచర్వణాక్రియాసమభిహార హరితఫేనచ్ఛటాచ్ఛటపిచ్ఛిలంబును దారుణ్య
దర్పభరకవోష్ణ నిశ్వాసధారాధురంధరంబును జలాంచలప్రోథదళసంపుటం
బునునగు సగ్ఘోటీవదనంబుచుంబించె సంజ్ఞయు నిజాంతఃకరణప్రవృత్తియప్ర
మాణంబుగా నతిప్రమాణమూర్తిస్ఫూర్తియగు సత్తురంగింబుఁబతంగునా
కాఁదలంచియిచ్చగించెనత్తుఱగంబైనయమ్మత్తకాశిని గించిదున్నిద్రపారిభద్ర
కలికాచ్ఛాయాముద్రకుద్దియగు ముద్రవిరియించుచు మొగుచుచుంగదల
కుండమోరమోరతోమోపియుగండంబుగఅచియుడాసియుఁ బాసియుజివళి
చేసియుఁగొంతదడవువినోదించియు నక్కహనాహారయం బగ్గోడిగడగ్గఱియుం
డెనప్పుడమ్మావునకుముఖగ్రోళ్ళనెక్కచరమధాతుద్రవంబు గదంబకుసుమకే

సరపరాగగంధపాంసుధమంబై సేవించె నయ్యింద్రియంబునఁ జంద్రబింబా
ననకునిద్ధమగువలవారు నాసత్యులనం బ్రభవించి రశ్వికుమారద్వయంబు॥ గీ॥ వి
బుధవైద్యద్వయంబయ్యెవిమలచరిత। యంతనిజమూర్తి ధరియించె నబ్జహి
తుఁడు। సంజయును దాల్చెనిజమూర్తి సంతసించి। దంపతులుచనిరాత్మనిసా
స్థానమునకు॥ వ॥ అంతనక్కడశనైశ్చరుండు వారాణశికిం జని లింగస్థాపనం
బుచేసినాశనైశ్చరేశ్వరుండువిశ్వేశ్వర దేవునకు దక్షిణభాగంబున శుక్రేశ్వ
రునకుత్తరంబునసుప్రతిష్ఠితుండై భజియించువారికి భోగమోక్షంబులుప్రసా
దించుశనైశ్చరునకుఁదత్ప్రసాదలబ్ధంబీలోకం బని శనైశ్చరలోకవృత్తాంతం
బు॥ క॥ సప్తమహామునిలోకము। సప్తార్చిప్రతిమ తేజసకలైశ్వర్య। వ్యాప్తి
కరంబిదిచూడుము। ప్రాప్తాఖిలవిద్యభూసుపర్వవరేణ్యా॥ వ॥ మరీచియత్రిపు
లస్త్యుంపులహుండు క్రతువంగిరసుండువశిష్ఠుండువీరు బ్రహ్మమానసపుత్రు
లుసప్తబ్రహ్మలువీరికిధర్మపత్నులు క్రమంబునసంభూతియునసూయయుక్షమ ప్రీ
తిసన్నతిస్మృతియుక్ష వీరివలననానాప్రజాపతులునానారూపప్రజలసృజియించిబ్ర
హ్మదేశంబున నయ్యవిముక్తక్షేత్రంబునఁదపంబుచేసిమరీచ్యత్రీశ్వరాదిలింగం
బులం బ్రతిష్ఠించిరిసంభూత్యనసూయాదులగుపతివ్రతలును దమపేళ్లశివలిం
గంబులం బ్రతిష్ఠచేసిరి తత్ప్రసాదలబ్ధంబై యాలోకంబున సప్తమహామునులు
ను బరమసుఖంబులనుభవించుచున్నవారిది సప్తమహామునివృత్తాంతంబీలో
కంబునకునూర్ధ్వంబున॥ సీ॥ త్రైలోక్యమంటపస్తంభసంభారంబుగగనలక్ష్మీ
కంఠకనకభూష। బ్రహ్మాండకేతకీ పాదపప్రసవంబు గంగాతరంగిణీక్రౌంచఖగ
ము। బలిదైత్యమధనాంఘ్రిపంకేజనఖరంబుదారకావళితులాదండయష్టి। ధా
తృలోకద్వారదంతకవాటంబుగ్రహమండలీ పశుగ్రామవేది। తారకాశింశు
మారకాకారుఁడైన। యాదినారాయణునితోఁక యలఁతిచిప్ప। దవ్వుకీక్షిం
పుధరణీబృందారకేంద్ర। వివిధకల్పపరంపరాధ్రువునిధ్రువుని॥ వ॥ ఈతని
లోకవృత్తాంతంబువినుము॥ క॥ స్వాయంభువమనుధాత్రీ। నాయకుఁడుత్తాన
పదుఁడసంగాంచెనుతుర్యా। దోయజనేత్రిలు గేహిను। లాయయ్యకునిరుపురం
బుజాసనవంశా॥ గీ॥ కాంతయొక్కతసురుచియొక్క తెసునీతి। సురుచికుత్త
ముఁడనుపేరిసుతుఁడుపుట్టె। ధ్రువుఁడుపుట్టె సునీతికాధ్రువునికంటె। నుత్త
మాహ్వయుమన్నించుచుండుఁదండ్రి॥ గీ॥ ఒక్కనాఁడోలగంబుననున్నవేళ।
గురునితొడమీఁదఁగూర్చుండెసురుచికొడుకు। ధ్రువుఁడునేతెంచివాఁడున్న
తొడయెమెక్క। సురుచివారించెభూపతిచూచుచుండ॥ వ॥ అప్పుడు మరలి
వాఁడంతఃపురంబునకరిగి యావృత్తాంతంబు తల్లికెఱింగించి పిన్నయయ్యను

సుత్తమక్షత్రియ తేజోవిశేషంబునం బరిభవంబుసహింపం జాలక తల్లియను
జ్ఞ వడసి తపంబు సేయం జనువాఁడు యదృచ్ఛాగతులగు సప్తఋషులం గాంచి
సముచితప్రకారంబునం దనవృత్తాంతంబు వారికెఱింగించి వారివలన ద్వాదశా
క్షరమంత్రోపదేశంబు గొని పరమభక్తిపరాయణుండై నారాయణు మధు
వనప్రాంతంబున యమునాతటంబునం బెద్దగాలంబు పెక్కువిఘ్నంబులకు మ
నంబు చలింపనీక యారాధించిన సాక్షాత్కరించిన యప్పుండరీకాక్షునివలన వి
శ్వోత్తరంబైన యిప్పదంబు గాంచె॥ గీ॥ ధ్రువునికిచ్చిన మహిమంబు ధ్రువము
గాఁగ। నతఁడు దాను వారణాశికరిగి శౌరి। వానిఁ దన వెన్కదిక్కున వైనతేయు।
మీఁద నెక్కించుకొని చిట్టిమిడిచెనంత॥ మ॥ శివుఁ గాశీపతి విశ్వనాయకుని సంసే
వించి యప్పార్వతీ। ధవు నాజ్ఞన్ గ్రహచక్రవాళమున కూర్ధ్వంబైన లోకంబు
నన్। ధ్రువవర్తింపుమనేక కాలమనుచు న్బోధించి మేరగా మనో। జవనుండై
నఖగేంద్రు వేగమున విష్వక్సేనుఁ డం దేనియున్॥ ధ్రువుండును ॥ సీ॥ మణిక
ర్ణికావారి మజ్జనం బొనరించి యవిముక్తమునయందు శివుని నిల్పి। యాశివలిం
గంబున నిశంబు సేవించి యందు విశ్వేశ్వరు నావహించి। పంచాక్షరీమంత్రపా
రాయణంబును బ్రణవమంత్రంబును బరిచరించి। విశ్వనాయకు కృపావిభవంబు
పెంపునం బరమోన్నతంబైన పదముగాంచెఁ। గాశిలో నధ్రువేశ్వరుఁ గాలకం
ఠు। భక్తి సేవింప ధ్రువమైన పదము గలుగుఁ। బంచజనునకు నిది సిద్ధ భాషితంబు।
సమధికస్మార్తశుభకర్మ శంభుశర్మ ॥ వ॥ అని చెప్పిరంత నవ్విమానంబు ధ్రువ
లోకంబు గడచి క్రమంబున మహాలోక జనలోక తపోలోకంబులఁ దిక్రమిం
చి సత్యలోకంబు గదిసె నప్పుడ విష్ణుకింకరులు శివశర్మకిట్లనిరి॥ క॥ ముందట ఇది
బ్రహ్మలోకము। సందర్శింపుము త్రినేత్రశర్మధరిత్రీ। బృందారక యిది పరమా।
నందస్థానంబు ద్రుహిణునకు నెలవగుటన్॥ వ॥ అనుచు నతని నబ్జగర్భసమ్ము
ఖంబునకుం గొనిపోయి రవ్విభుండును వారలం బ్రసాద బహుమానంబులం దని
పి ప్రసంగవశంబున నమ్మహాశ్మశానంబున మృతుండు గాని వానికి ముక్తిసిద్ధింప
దని సముచితప్రకారంబు గావించుకొలిపె శివశర్మయు నమ్మాటకు సంశయాకు
లుండగుచుఁ దదూర్ధ్వంబు గాఁ జనిచని పుణ్యశీలసుశీలురం జూచి మనకింక
నెంత దవ్వరుగవలయు నెఱుంగింపుం డప్పుడు పితామహుండు గాశియందు శరీ
రంబు విడువక మోక్షంబు లేదనియె నాకు నిశ్శ్రేయసప్రాప్తియెట్లగు నవ్విధంబు
ను వివరింపుండనిన వారలిట్లనిరి॥ గీ॥ ఊర్ధ్వకెనిమిది కోటుల యోజనముల। పొడ
వునం దుండు సేధాత్రుభువనమనఘ। యాప్రమాణంబునన యుండు నిందుఁ మీఁద।
విష్ణులోకంబు సతతవర్ధిష్ణువగుచు॥ వ॥ అవ్వైకుంఠంబునకు మీఁదఁ బదఁ యు

కోట్లయోజనంబులపొడవున శివలోకంబుగైలాసాహ్వయంబనందనర్చు దా
నికింబరమంబగులోకంబు లేదు॥ గీ॥ సంశితాచారపరదానిసంస్తుతింప। మాక
కాదచ్యుతునకుఁదామరసభవునకు। కైనశంభునకైననునహివిభునకు। నైనఁగీ
ష్పతికైననునలవిగాదు॥ వ॥ అప్పరమస్థానంబునందు నిందుధరుండు గిరినంద
నాసహాయుండై గణాధిపతిస్కందనందికేశ్వరాదులుగొలువ నుదారవిహారం
బులం బ్రవర్తిల్లుచుండునవ్విశ్వేశ్వరుండు విశ్వరక్షణార్థంబుగాఁ జతుర్భుజుఁ జ
తుర్దశభువనాధిపత్యంబునకుం బట్టాభిషిక్తుంజేసి యనంతరంబ ॥ సీ॥ మండువే
సవినాఁటి మార్తాండబింబంబు గోడగించుపసిండిగుబ్బతోడఁ। దొలుకాఱు
క్రొమ్మెఱుంగులధాళధళ్యంబు శవణించురత్నదండంబుతోడ। నచ్చవెన్నెల
చాయహెచ్చుకుందాడెడు వెలిపట్టుజగజంపువలువతోడఁ। గడలియం దేకో
దకము వేళఁబుట్టిన పవడంపుఁదీఁగలపంజుతోడ। వేనవేల్యోజనంబుల విరివి
నొప్పు। లక్షకోటికళాకికాలంకృతంబు। దారకాష్ఠాలమహాకీర్తి కస్థాపితంబు। వి
ష్ణునకుఁబట్టువెనకయ్య వెల్లగొడుగు॥ గీ॥ పార్వతీదేవికై సేసెబహువిధములఁ।
బలుకుదొయ్యలిరత్నదర్పణముచూపె। శచిసివాళించెమణిదీపసంచయమున।
శేషశయనునిఁబట్టాభిషేకవేళ॥ సీ॥ చాముండియొనరించు జంపెతాళమునకు
భృంగీశ్వరుండాడెఁ బేరణంబు। వెనుకదిక్కుననుండి కనకభూషలు మ్రోయ
సూర్యుండుశశియుపేచోపులిడిరి। వెండికట్టులతోడి వేత్రదండముపూని సంద
డినెడఁగల్గజడిసెమునుఁడు। గాలోచితంబుగాఁ గైవారమొనరించెఁ బలుకు
దొయ్యలిగద్యపద్యసరణి। సకలలోకములకును బ్రహ్మాండములకు। నాధిప
త్యంబుపూనిసింహాసనమున। మునులచేవేల్పులచేత మ్రొక్కుగొనుచు। న
చ్యుతుండోలగంబున్న యవసరమున ॥ లయగ్రాహి॥ మ్రొక్కిరిగణేశ్వరులు
మ్రొక్కెజలజాసనుఁడు। మ్రొక్కెమునిమండలము మ్రొక్కిరిదిగీశుల్।
మ్రొక్కెనుమరుద్గణము మ్రొక్కెసురవ్రజము। మ్రొక్కెదనుజావళియు
మ్రొక్కిరురగేంద్రుల్। మ్రొక్కెనిగమప్రతతి మ్రొక్కెమనుయాధములు
మ్రొక్కెనితిహాసములు మ్రొక్కెనచలంబుల్। మ్రొక్కెఁదటినీకులము
మ్రొక్కెఁజతురంబుధులు నక్కమలనేత్రునకు నక్కజపుభక్తిన్॥ వ॥ ఇవ్వి
ధంబునం జతుర్భుజునిర్భరస్నేహంబున భూర్భువస్స్వర్భువంబుల సామ్రాజ్యభా
రభరణంబునకుం బట్టాభిషేకంబుసేసి ఫాలలోచనుండు ప్రావృషేణ్యపాథో
ధరధ్వానగంభీరంబగు నెలుంగున స్వయంభూజంభారిప్రముఖులగు బర్హిర్ముఖు
లాకర్ణింప విష్ణుండ యేననియును నేనవిష్ణుండనియును నాకువిష్ణునకు భేదంబు
లేదనియును హరిమంగళాయతనంబనియును విష్వక్సేనుండుమాసనీయుండని

యును నారాయణుండు జగద్రక్షాపరాయణుండనియును నచ్యుతుండ నాదిని
ధనుండనియును నరవిందలోచనుం డాదిపురుషుండనియును హరిసర్వపాప
హరుండనియును నానతిచ్చి తనయిచ్చనెచ్చోటికేనియువిచ్చేసెనియాఖ్యా
నంబు చతుర్భుజాభిషేకంబన్రడు దీనింబఠియించినను వినినను వ్రాసినను నరుల
కాయురారోగ్యైశ్వర్యంబులుసంభవించు శివశర్మ నీవీరహస్యధర్మం బెఱింగి
హరిహరత్వంబులయందు భేదంబు సేయకుండుమని చెప్పిరంత నవ్విమానంబు
విష్ణులోకంబుగదియుటయు నాతనింజూచియిది వైకుంఠలోకంబిందు లక్ష్మీస
హాయుండై వైకుంఠుండుండు నీవిందుఁబరమానందంబున శతానందపరివత్స
రపర్యంతంబు వసియింపు మిటమీఁదివృత్తాంతంబు చెప్పెదము పుణ్యాతీర్థమర
ణోపాత్తంబయిన ఫలంబుననుభూతసుకృతశేషంబున భూమండలంబునకుడిగ్గి
నందివర్ధననగరంబునవృద్ధకాలుండను పేరిరాజవై పెద్దగాలంబు రాజ్యంబు సే
యంగలవు నీరాజ్యంబునందు॥ క॥ కురియు నెలమూఁడు వానలు । సురభులు
చన్నవసిపితుకుసుకృతముజరుగుఁ । ధరగోంద్ర వేలుపండుఁ । బరఁగుంబురు
షాయుషములుప్రజలకు నెల్లఁ ॥ వ॥ ఇవ్విధంబునం బెద్దగాలంబు రాజ్యంబు
చేసిసుతవిన్యస్త రాజ్యభారుండవై కాశికరిగియయోధ్యావంతీ మధురామా
యాద్వారవతీ కాంచ్యుజ్జయనీ తీర్థసేవాఫలంబున విశ్వనాథు ప్రసాదంబున
నపవర్గంబు గాంచెదవనిపలికి విష్ణుకింకరులతనిదివ్యవిమానంబువలనడించి
నారాయణదేవు సమ్ముఖంబునం బెట్టిరప్పుణ్యశ్లోకుండును విష్ణులోకంబునం బె
ద్దగాలంబుసుఖంబనుభవించిపుణ్యశీలసుశీలురు చెప్పిన ప్రకారంబున మోక్షం
బు వడసెనని లోపాముద్రకుఁగుంభసంభవుండు శ్రీశైలకటకంబునందు సకల
తీర్థంబులుం గాశీప్రాపణ ద్వారంబున నారాదుపకారంబులై మోక్షంబులి
చ్చుఁ గాశియవ్యవధానంబున ముక్తినిచ్చుననునర్థంబు దేటపఱిచె నిదిశివశ
ర్మ నిర్వపణంబనునుపాఖ్యానంబుదీనివిన్ననుం బఠియించినను వ్రాసిననునరుల
కాయురారోగ్యైశ్వర్యములు సంభవించునని చెప్పి॥ ఉ॥ చేసెఁబ్రదక్షిణంబు
గలశీసుతుఁడద్రికిమల్లికార్జునా। వాసశిఖాంతరంబునకువామవిలోచనతోడఁ
గూడవి । శ్వాసముభక్తియుఁ హితముశాంతియుదాంతియునొప్పనంతరా।
ధ్యాసితశంభులింగసముదాయమువారకసంభజించుచుఁ॥ వ ॥ చేసికతిపయ
ప్రయాణంబుల॥ లయగ్రాహి॥ సామిమలకుంజనిమహామునిఘటోద్భవుఁడుభా
మయునుదానుగడునేమమునఁబుణ్యా । రామతరువాటిమణిధామముననున్న
యభిరామసుకుమారతరహేమనిభగాత్రుఁ । సామజముఖాగ్రజు సుధామ
ధురమందహసితామలకపోలవదనామృతమయూఖుఁ । హైమవతిపట్టి నఖి

లా మరకరణ్యనతకామితకర్ణ గోమరసామిభ జయించెన్ ॥ వ॥ అవినవినిన్నై మి శారణ్యవాసులగువాచంయములు కుంభసంభవుండు కుమారస్వామి దర్శించినయటమీఁదివృత్తాంతం బెయ్యదియనియడిగిన॥ శా ॥ వేమక్ష్మోణివరాను సంభవదిశా వేదండగండస్థలీ। సీమాపిచ్ఛిలదానగంధలహరీ శ్లేషానుభూతిక్రియా। సామగ్రీపటుకీర్తి సౌరభకుభృచ్ఛార్దూలసౌభాగ్యరే । ఖ్యామత్స్య ధ్వజమత్స్యవంశనృపరక్షా కేలిపక్ష్మేక్షణా॥ వ ॥ అరిరాడ్గజకంఠీరవ। బిరుదాలంకారపృథులభీషణబాహా। కిరవాలనిశితధారా।పరిఖండితదుర్మదాంధపరిపంథినృపా॥ఉత్సాహ॥ అసమబాణనిభవిలాసయాజిగాండీవాయుధా। బసవశంకరావిశుద్ధపంటవంశశేఖరా । కసిమికోటవేంకటాయికప్పకొండకిల్లెదా। ద్యసుహృదవనిపాంతరంగ హాలహాలవిషానలా॥

గద్య॥ ఇదిశ్రీమత్కమలనాభ పౌత్రమారయామాత్యపుత్ర
సుకవిజనవిధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన
కాశీఖండంబను మహాప్రబంధంబునందు
చ తు ర్థా శ్వా స ము.

---



కాశీఖండము – పంచమాశ్వాసము.

---

శ్రీమార్కండేయేశ। స్వామికృపాలబ్ధధరణిసామ్రాజ్యరమా। హేమాద్రిదానదీక్షిత। వేమాంబాప్రియకుమారవీరనృపాలా॥ వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకిట్లనియెఁ గుమారస్వామి పత్నీసహితుండైన మహామునినగస్త్యునాదరించి కుశలంబడిగి కూర్చుండ నియమించి వచ్చిన ప్రయోజనంబు దెలిసి వారాణసీమాహాత్మ్యంబువినిపించువాఁడై యక్కుంభసంభవునికిట్లనియె॥ గీ॥ ఆఱుముఖములుగలవాఁడ నౌదుఁగాని। నిగమశాస్త్రార్థములుగాన నేర్తుఁగాని। యధికనైదగ్ధ్యవంతుండనగుదుఁగాని। కడఁగివర్ణింపనోపశ్రీకాశిమహిమ॥ వ ॥ అయినను నానేర్చుభంగిఁ గాశికామాహాత్మ్యంబువినిపించెద నడుగవలసినయర్థంబులడుగుము కొల్లాపురము మహాలక్ష్మిపుత్రేరనైతదర్శంబునీవువచ్చుట యెఱుంగుదుననిపలికినఁ గుంభసంభవుండు గు

మారస్వామిపాదాంభోజంబుల కెరఁగియుల్లనిరమె మహాశ్మాయవిముక్తంబు
మోక్షస్థానంబనియును మణికర్ణికాతీర్థంబుతీర్థరాజంబనియును నపవర్గక్షే
త్రంబువిముక్తంబానందకాననంబు మహాశ్మశానంబు రుద్రావాసంబు వారా
ణశిగాశియను నామధేయంబులు ధరియించుననియును చెప్పుదు రన్నియుం
బరిపాటివినవలతుం జేటపడ నానతిమ్ము॥ గీ॥ అనినఁబర్వతరాజకన్యాసుతుండు।
కలశసూతికినిట్లను గారవమున। నిల్వలారిభవత్సనుదీరితముగు। ప్రశ్నభాగం
బువిస్తరింపంగభరము॥ వ॥ ఈయర్థంబుమాతల్లిపార్వతీదేవి మజ్జనకుహరు
నినడిగె నాసర్వజ్ఞుండాజగన్మాతకునానతిచ్చినప్రకారంబునీకుం జెప్పెద సావధా
నమతివై యాకర్ణింపుము॥ సీ॥ అంబుజాసనునాయురవసానమునయందు గ్ర
స్తసమస్తలోకప్రపంచ। సైమాయనిర్వికల్పాకారమునఁదను నాశ్రయింపఁ
గఁబరమాత్మయుండె। నిస్తరంగసముద్రనిభమైనిరస్తసమస్తావధికమయిప్రా
ణికర్మ। పరిపాకకాలంబుప్రాప్తమయ్యెడునంత దాఁక నెవ్వేళవిధాతృసృష్టి।
గగనమొక్కండచిక్కఁగఁగ్రాఁగిపోవ। నంధకారంబునీరంధ్రమగుచుఁబ్రబ
లె। సత్తునసత్తుసదసత్తుత్రితయమ్యె। నెఱుకపడదయ్యెనేమియునేమిసెప్ప॥
వ॥ అనర్కచంద్రగ్రహతారకానక్షత్రంబ నహోరాత్రంబ నగ్నిభూసలిల
మారుతంబ ప్రధానంబ శబ్దస్పర్శగంధరూపంబ దిఙ్ముఖంబై భువనప్రపంచం
బంధకారావశేషంబై యుండ బ్రహ్మాండంబునిష్ప్రచ్ఛరంబై కేవలత్వంబుభ
జింప ననామరూపవర్ణంబున స్థూలంబున కృశంబున హ్రస్వంబున దీర్ఘం
బున లఘువున గురువున పనయంబున నుపచయంబున వాఙ్మనసగోచరంబు
సత్యజ్ఞానానందరూపంబున ప్రమేయంబున నాధారంబున వికారంబు నిర్గుణం
బు నిర్వికల్పంబు నిరాలంబంబు నిర్మాయంబు నిరుపద్రవంబునై పరబ్రహ్మం
బుతూష్ణీభావంబుగైకొని నిష్కళంకంబై విహరించుచు లీలాకైవల్యంబున
లోకమర్యాదనాదరించి నిజశరీరంబుననొక్కశక్తిఁగల్పించె నాశక్తిప్రకృ
తిరూపంబవగునీవయాపరబ్రహ్మంబుపురుషరూపుండై నవేనుగల్యాణియాది
కాలంబునందు॥ గీ॥ ఉండఁజోటెచ్చటను లేకయుత్పలాక్షి। మనముచేఁతివి
విముక్తమంటపంబు। నాఁడు మొదలుగనిపుడునున్నారమందుఁ। గాశికానగ
రీసంజ్ఞకంబునందు॥ సీ॥ అనిశంబుఘనచేతనవిముక్తమైయున్కి ముగ్ధాక్షి
యుదియవిముక్తమయ్యె। మనకునానందంబునొనరించుఁగావున నానందవిపినా
భిధానమయ్యె। సంవసింతుమహాశ్మశానభూములఁ గాన నేనుంటను మహాశ్మ
శానమయ్యె। నోరంతప్రొద్దునునుండదుదురుద్రుఁడనే నటుగానరుద్రగేహాఖ్యమ
య్యె। నశియువరుణయుఁగూడువర్ణములఁసమితి। సామిసమితవారాణశిసంజ్ఞ

యయ్యెఁ । గాశ్యదీప్తావసంగవిఖ్యాతమైన । ధాతువునఁగాశియయ్యె భూతల
మునందు॥ శా॥ నక్షత్రగ్రహతారకంబులునరణ్యాంబుల్ నములార్వర్ధివి । శ్వక్ష్మో
ర్వీధ్రములున్ దిశావసుమతీచక్రంబు గాలంబు చేఁ । బ్రత్యక్షత్వముఁ బొందియు
న్న యెడవిశ్రాంతిన్ సుఖంబుండఁగ । శ్రీక్షేత్రంబిదియంబుజాక్షి మానకున్ సిద్ధిం
చెనే కాలమున్ ॥ గీ॥ ఈరహస్యంబు చెప్పకు మెవ్వరికిని । శంభుభక్తునకత్యంత
శాంతమతికి । శ్రద్ధధానునకధికవిశ్వాసమతికి । ననఘమానసునకుమ ముక్షు
నకుఁదక్క ॥ వ॥ అనిభవుండు భవానికానతిచ్చె మణికర్ణికామాహాత్మ్యంబు
వినుము॥ ఉ॥ నిండుమనంబుతోడ ధరణీధరకన్యయుఁ దానుగాశిఁగా । పుండికు
టుంబభారము మహోన్నతిఁ బొందుటఁ జూచి విశ్వనా । థుండొకనాఁడు శై
లసుతతోడ విచారము చేసె నత్తుఁడో । క్కండు హితుండు భారకుఁడుగావలదా
మనయింతయింటికిన్ ॥ గీ॥ అనివిచారంబు చేసికాలాంతకుండు । చూచెనరగం
టగిరిరాజసుత మొగంబు । ప్రభవ మొందెనా చూపునఁ బ్రావృషేణ్య । ముదిర
నీలాంగుఁడగు నొక్క ముద్దుకొడుకు ॥ వ॥ అబ్బాలునింజూచి బాలేందుధరుం
డు॥ సీ॥ పుండరీకేక్షణాపురుషోత్తమాహ్వయ శిఖిపింఛసంఛన్న చికురభార ।
యాజానుదీర్ఘబాహార్గళద్వయయుగ్మ హారినీలసింహాసంహననకాంతి ।
గంభీరతరనాభికాసారభవపద్మ శ్యామాపిశంగవాస్తశకటీర । శంఖచక్రగదాసి
శార్ఙ్గదివ్యాయుధ కందర్పకోటిరేఖావిలాస । కాశిపట్టణమునసైదుక్రోశము
లును । పటుతరక్షేత్రమిది రాజ్యపదవినాకుఁ । బరమపుణ్యాత్మయీకుటుంబము
భరింపు । తత్పరతమీఅభారకత్వంబుపూని ॥ వ॥ అనిపల్కి మహేశానుండు
బుద్ధితత్వస్వరూపియగు విష్వక్సేనుం గాశికాపురిసామ్రాజ్యభారంబు భరియింప
నియోగించిన జనార్దనుండును ॥ గీ॥ చక్రమునఁద్రవ్వి యొక్కపుష్కరిణిసే
సి । ఖననవేళాప్రయాససంజనితమైన । ఘర్మజలమునఁ బూరించెఁగైటభారి ।
యమ్మహాపల్వలంబు గాశ్యంతరమున॥ క॥ వేయును నెనిమిది యేండ్ల । తో
యజలోచనుఁడు చేసె దుస్సహతపము । త్రోయమాధారముదరిఁగా । త్ర్యయ
న్యధిపతిగురించి యతులితభక్తిన్ ॥ వ॥ అనంతరంబ ॥ శా॥ ఇందూత్తం
సుఁడు కాశికాధిపతి విశ్వేశుండు ప్రత్యక్షమై । కందర్పారిముకుందనిర్మితమహో
కాసారముం జూచియా । నందంబొంది వృషధ్వజుండు బహుమానశ్లాఘఁగా
వించెదా । మందాందోళితమౌళియై విధుశిరోమాల్యావలుల్ మ్రోయఁ
గాన్ ॥ క॥ ఫణిభూషణుండువాపీ । ప్రణుతిశ్లాఘాపరంపరలనొనరింపన్ ।
ద్రిణయనునిదక్షిణశ్రుతి । మణికర్ణిక యిట్టిసరసిమధ్యమునఁ బడెన్ ॥ వ॥ పర
మేశ్వరశ్రవణ మణికర్ణికా ప్రపతన స్థలంబగుటం జేసి యచ్చక్రపుష్కరిణి

మణికర్ణికాహ్వయంబై యుండు॥ గీ॥ చక్రపుష్కరిణీతీర్థ సవిధభూమి। శంఖచక్రగదాపాణిశంభునడిగెఁ । గాశికాతీర్థమాహాత్మ్య గౌరవంబు । శివుఁడునానతియిచ్చెనక్షీణకరుణ ॥ వ ॥ అదివివరించెద నాకర్ణింపుముమణికర్ణికాతీర్థంబునందు సంధ్యాస్నాన జపహోమ వేదాధ్యయనంబులు వ్రతోత్సర్గవృషోత్సర్గంబులు లింగస్థాపనంబులును నక్షయమోక్షఫలంబు నొసంగు భూతభావిభవత్తీర్థంబు లీతీర్థరాజంబుతోసరిరావు సాంఖ్యయోగంబాత్మావలోకనంబు వ్రతతపోదానంబులు దత్తీర్థస్నానంబునకు సమానంబులుగావు శశమశకకీట పతంగోరగంబులు పంచక్రోశియందుఁబంచత్వంబునొంది నిర్వాణలక్ష్మిఁగైకొనుఁ గాశీక్షేత్రము నందెప్పుడుఁగృతయుగంబెప్పుడు నుత్తరాయణం బెప్పుడు మహోదయంబు చతుర్వేదాధ్యయనంబుచేసిన పుణ్యంబుగాశిం బంచాహోరాత్రంబులు వసియించిన వారికింగలుగు నశ్వమేధ రాజసూయాధ్వరంబుల నుపార్జితములైన ఫలంబులుగాశిం ద్రిరాత్రశయనంబున సమకూఱుఁ దులాపురుషదానఫలంబు గాశీదర్శనమాత్రంబునం గలుగుఁ గాశీస్థానంబున నాయాజ్ఞదక్క నితరులయాజ్ఞచెల్లదు యోజనశతదూరస్థుండైననరుండుగాశీస్మరణంబున దోషంబువలనంబాయుఁబంచక్రోశప్రవేశసమయంబునం బంచజనుని పాపప్రపంచంబు బహిరంచలంబుననవసియించుఁగాశిం బెద్దగాలంబుండి దైవయోగంబునంబరస్థలంబునకరిగి మృతుండైనమనుజునకుఁ గాశీమరణఫలంబుసంభవించు నవిముక్తక్షేత్రవాసంబు గర్మనిర్మూలనక్షమంబు మణికర్ణికంగృతాభిషేకుఁడై తిలవ్రీహియవంబులఁ బిత్రాదితర్పణంబొనర్చిన నరుండు సర్వయజ్ఞ ఫలంబునంబ్రాపించు మణికర్ణికాస్నానానంతరంబున మౌనంబునం జితేంద్రియుఁడై విశ్వేశ్వరశ్రీమన్మహాదేవునివర్ణించునెవ్వండువాఁడు సర్వవ్రతంబులుం జేసినస్నానదేవార్చనాజపాదుల మూత్రవిసర్జనసమయంబుల దంతధావనహోమకాలంబులవాచంయముండై విశ్వేశ్వరునర్చించిన నరుండేకవాసరంబుననయావజ్జీవశివార్చనాఫలమునొందు విశ్వేశ్వరప్రీణనార్థంబు గాశియందుసిధనంబునొందు మానవుండు కైవల్యధనలాభంబు లంగీకరించు నిష్ప్రత్యూహంబైన యోగంబున నానాజన్మోపార్జితంబైన ఫలంబుగాశియందుఁ దనుత్యాగంబుసేసిననరునకుసిద్ధించుఁగాయంబుపాపాలయంబనియును బ్రసూతిమరణక్లేశంబులుదుస్సహంబులనియును వితర్కించి నరుండాయురవసానపర్యంతంబుగాశినయుండునది॥ శా ॥ అర్ణోరాశిపరీతభూభువనమధ్యస్వర్గఖండంబునం। పూర్ణైశ్వర్యసమృద్ధిగాశి గృతపాపుండైనఁ దన్పట్టణా। భ్యర్ణక్షో

ణులనై దుఃక్రోశములఁ బ్రాణాంతంబునకు మర్త్యుడా! కర్ణింపఁడు కృతాంత వాహమహిషగ్రీవేయఘంటాధ్వనుల్॥ వ॥ అనిశంభుండు విశ్వంభరు నిరీక్షించి యింకొక్క విశేషంబాకర్ణింపుము భగీరథుండను రాజన్యుండు కపిలముని ప్రదీప్తకోపానలదగ్ధులగు సాగరుల నిరయంబువలన నుద్ధరించుటకై తపోవిశేషంబున శుండాకినింగొని తేర నమ్మహానది యిమ్మణికర్ణికమీఁదం బ్రవహించె నది మొదలు నాన త్తీర్థంబు సురాసురులకు వర్ణింపనశక్యంబై విలసిల్లుచుండు॥

సీ॥ భాగీరథీస్నానపరతఁ బోలంగలే దామ్నాయశాస్త్రాగమాధ్యయనము। వాలాయమును మనోవాక్కాయదురితాళి విదళించు గంగాభిషేకణంబు। శ్రీకంఠుకృపలేక సిద్ధింపనేరదు త్రిదశసంగానదీతీరవసతి। బ్రహ్మవిజ్ఞానసంప్రాప్తిహేతువు జహ్నుకన్యాసింధుసలిలసేవ। కలియుగంబునఁ గలుషచిత్తులగు శఠుల। కన్యవిత్తాపహర్తల కనియతులకు। నాత్మయందుఁ బ్రాయశ్చిత్తమాచరింపఁ। గాంక్షగల యప్పునరునకు గంగ దిక్కు॥ గీ॥ ఆదియుగమునఁ దీర్థంబులఖిలములును। త్రేత ద్వాపరమునయందుఁ దివ్యమునకుఁ। బుష్కరంబు గురుక్షేత్రమును సుపర్వ। నిమ్నగయు దీర్ఘములు బ్రహ్మనిర్మితములు॥ గీ॥ కృతయుగంబున ధ్యానంబు కేవలంబు। తపము త్రేతాయుగంబున ద్వాపరమున। నధ్వరంబులు కలివేళ యందు గంగ। జనులకిష్టార్థసంసిద్ధిసాధనములు॥ శా॥ స్వారాజావరజాత పారమగు ప్రాగ్జన్మాంతరాభ్యాససం। స్కారంబున్మదనుగ్రహంబు వెలిగా స్నేహంబు సిద్ధించునే। వారాణశ్యుపకంఠదేశవిలుఠద్వార్వేణివీచీఘటా। ధీరధ్వానపరంపరాకలకలోద్విగ్నాఘు భాగీరథిన్॥ క॥ ఆకంఠకరటిఘంటి। శ్రీకంఠజగండమదమషీచంద్రకితా। నేకప్రవాహజాహ్నవి। వైకుంఠాదొట్టి పాటివారికిఁ గలుగున్॥ క॥ గంగానది గంగానది। గంగానదియనుచుఁ దేపకడ మేల్కనుచో। గంగఁ గొనియాడు నెవ్వఁడు। భంగించు నతండు ఘోరపాతకచయముల్॥ ఉ॥ పాయునలక్ష్మి నవ్వాయున శుభంబులు వాయును దుర్నిమిత్తముల్। వాయునకీర్తి వాయుఁ బ్రతిబంధము వాయు మహాఘసంఘము। ల్డాయు శుభంబు డాయు కుశలంబులు డాయు మనోరథార్థముల్। పాయక కాశికస్టైపురఁ బాఱు వియన్నదిఁ దీర్థమాడినన్॥ క॥ ఏలా యుపవాసవ్రత। మేలా యష్టాంగయోగమేలా యజ్ఞం। బేలా తపంబు గంగా। కూలంకషఁ దీర్థమాడఁ గూడిన యేనిన్॥ క॥ శ్రద్ధాపురస్సరంబుగ। సిద్ధస్రోతోవహంబు సిస్నానాసన। బద్ధహృదయులగువారికి। సిద్ధించును మోక్షలక్ష్మి చేరువ నహరీ॥ ఉ॥ వానికులంబు నుంగులమె వానితపంబులునుం దపంబులే। వానికృతంబునుం గృతమె వా నిశ్రుతంబు శ్రుతంబె ప్రోక్షణమె। వ్వానిమనంబు పక్వమై త్రాలక యుండును విశ్వనా

యకా। స్థానమహాశ్మశానదివిష త్తటినీముఖతీర్థసేవకున్॥ క॥ విస్మయమే మరున్నది। యస్మత్తేజోగ్నిగర్భయటుగా కున్నన్। భస్మము సేయునికై టభ। ఘస్మరనిమిష మునసకలకలికలుషములన్॥ చ॥ నడచుచుఁ గూరుచుండుచును నవ్వుచు నిల్చుచుఁ బారియాడుచుం। గుడుచుచుఁ బవ్వళించుచును గూర్కుచు మేల్కనుచున్ రమించుచుం। ఉడుచును లేచుచున్న రుఁడు భావమునం దవిముక్తసీమసం। గడిఁ బ్రవహించు శ్రీగగనగంగఁ దలంచి త్యజించుఁ బాపముల్॥ క॥ జిహ్మగవిరోధివాహన। జిహ్మమతుల్దెలియువారె చిరకాలమునన్। బ్రహ్మం మున కుమఁబర। బ్రహ్మమయపయఃప్రపూరభరసురతటినిన్॥ క॥ అంగీకరించుమనుజుఁడు। సాంగోపాంగాధ్వరక్రియాఫలమువియ। ద్గంగాపులినంబునశివ। లింగార్చనమాచరించి లెస్సగ శౌరీ॥ ఉ॥ రోదనమాచరించువగఁ గ్రోధమనోభవకామలోభమో। హాదులఁ గూడి తీర్థములయందును ముందలఁ బట్టుపట్టినేఁ। డాదిగదీనఁ బాయఁబడెనామనకంచును గాశికాసమ। ర్యాదమునన్వియత్తటినినాడఁ గమర్త్యుఁడు గట్టిడిగ్గుచోన్॥ గీ॥ గంగకరుగంగఁ దలఁపవిఘ్నములు సేయుఁ। బ్రేతకంకపిశాచికాభూతతతులు। గంగడాసినపిదపవిఘ్నములు సేయ। వాసవుడు లేఁడు నరునకు వానితరమె॥ మ॥ అనుషంగంబున నొండెనొండెను విహారాపేక్షనొండేని ఘు। ర్మనిరాసంబున నొండెఁ దీవ్రభయసంత్రాసార్థ మొండేనిన। వ్యనియోగంబున నెవ్వఁడేమునుఁగు గంగాంభఃప్రవాహంబునన్। జనుఁడాతండును బుండరీకనయనాశాసించు పాపౌఘముల్॥ గీ॥ ఇచ్చలేకుండి నను నగ్ని మెట్లు గాల్చుఁ। దన్నునంటిన వారి నద్దాహశక్తి। నిచ్చ లేకక్రుంకిననుదహించునట్లు। తైర్థకుని బొందియున్న పాతకముగంగ॥ క॥ కంసాంతకనరుఁడంతకు। సంసారక్లేశముల విషాదమునొందన్। సంసేవించుంగాశ్యవతంసాభరణంబుగంగదా నెపుడేనిన్॥ చ॥ తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్థమాటకై। యరుగుచు నెవ్వఁడేని మృతుఁడౌ భవితవ్యతకారణంబుగాఁ। దెరువున నామనుష్యుఁడును దీర్థఫలంబఖిలంబు గాంచియుం। బురుహాదశాష్ట పాపములఁ బోకడవెట్టుబురార్జితంబులన్॥ సీ॥ అరుణాంశుమండలంబంధకారముఁ బోలె దంభోళివసుమతీధ్రములఁ బోలె। ఖగసార్వభౌముండు కాద్రవేయులఁ బోలెఁ గంఠీరవము గంధకరులఁ బోలెఁ దివ్యౌషధంబు వ్యాధినికాయములఁ బోలె మందు వేసవినిండు మడువుఁ బోలె। జంఝూసమీరంబు జలధరంబులఁ బోలె మానదంభంబు ధర్మంబుఁ బోలె। భక్తిసేవించువారిపాపములడంచు। దురితతరుషండశతఖండపరశుధార। మదనవైరిజటాటవీమల్లికలకు। నభశ్శిరోధిపమోభంగయమరగంగ॥ క॥ యావజ్జీవముగంగా। ప్లావంబొనరించునర్యుఁ

డుపంకజనయనా!జీవన్ముక్తుఁడుత్రిజగత్పావనుఁడని చెప్పుదురుతపస్విప్రవరుల్॥
గీ॥ వలదుతిథివారనక్షత్రవర్గణంబు! దీనసవాసజనులకువారిజాక్ష! సంచి
తములయినఖిలదోషములువాయు! నాకవాహినిసేకాభిషేకమునను॥సీ॥వలు
దచన్నులమీఁదిపలుపచ్చిగందంబు కమ్మఁదావులుదిఙ్ముఖములఁబొదువ!శశి
కాంతమణిశిలాశకలపాండురమైన మెయిచాయచంద్రికామృతముగురియ! జ
లదేవతాహస్తచామరానిలములు కుటిలాలకములకుఁగొండ్లిగఱప! ధవళాత
పత్రముక్తాదామకంబులు కుసుమవర్ణకిరీటకోటిమెఱయఁ! బూర్ణకుంభం
బుతోసితాంబుజముతోడ! దరముతోడనభీతితోఁగరములలర! నదనదీపల్వ
లంబులుగదిసికొల్వఁ! గాశిఁజేరోలగంబుండుగగనగంగ॥ క॥ మండూకమక
రకచ్ఛప! గండూపదదుళికుళీరకలహంసకకా! రండవబకములవెండిఁబ! సిం
డినిగావించిగంగఁజిదుముదుద్రవతుల్॥ వ॥ అనియిందుధరుండు ముకుందున
కానతిచ్చె గంగయు నీశ్వరోక్తప్రకారంబుననయురుగుదెంచి కాశీస్థానంబున
కపూర్వాలంకరణంబయ్యె నింకఁ గుంభినీధరపుత్రికి నద్దేవుండానతిచ్చిన ప్ర
కారంబునం గాశీమాహాత్మ్యంబు చెప్పెదఁ గుంభసంభవ యవధానపరుండవై
యాకర్ణింపుము॥ గీ॥ పరిహసించును వేదాంతభాగమన్న ! నుపనిషత్తన్న
మీనులనోకిలించు! గంటగించురుసాంఖ్యయోగంబులన్నఁ ! గాశినున్న నరుం
డుమోక్షమునఁదనిసి॥ క॥ దేహత్యాగముదానము ! దేహనిపాలంబుదపము
ధృతిఁబరికింపక ! దేహవియోగముయోగం ! బాహా కాశీపురీకృతావాసుల
కుణ॥ గీ॥ విశ్వనాథుండు దేహళివిఘ్నరాజు! గవని మొగసాలనధికారి గానొ
నర్చెఁ! గాశిఁజొరనీఁడుతనముద్ర గానియట్టి! ముక్తివిధి నెవ్వఁడోడుచునోమో
పమనుచు॥ క॥ వరుణనశిరెండుదిక్కుల ! దరుణేందుధరుడునిలిపెఁదలవరు
లంగాఁ! బరులెవ్వరిఁదారెట్లుఁగక! చోరనీకుండనుచుముక్తిఁజోరరీశంకర॥
వ॥ ఈశ్వరాదేశంబునంగాని కాశీనగరంబెవ్వరికింజొరరాదీయర్థంబుదేట
పడ నొక్కయితిహాసంబుగలదాకర్ణింపుము దక్షిణాబ్ధితటంబున సేతుబం
ధసమీపంబున నొక్కగ్రామంబున ధనంజయుండన నొక్కవైశ్యోత్తముం
డుగలం డతండుమాతృభక్తుండు తల్లిజరాభారంబునం బెద్దకాలంబునకుఁగా
లధర్మంబునొందిన॥ గీ॥ గాసిపడిగంగనస్థులుగలఁపకున్న! దల్లిబుణమెట్లువా
యుఁబుత్రకునకనుచుఁ! గదలెఁగోమటియానందకాననమున ! కంబకీకసశకల
సుమాతులుపూని॥ సీ॥ పంచగవ్యముననాప్లవనంబుగావించి పంచామృతమున
నభ్యంగమార్చి ! యక్షకర్దమముననను లేపమొనరించి పుష్పమాల్యంబు
లఁబూజసేసి!పట్టువస్త్రంబునఁబరివేష్టణమొనర్చి యామూటఁదిత్తిలోనదివి

తుటేమి! పుడమిఁగాఁగంబళంబునదృఢంబుగఁగట్టి ముద్దగామన్నద్దిముద్ర వెట్టి।
జతనముగరాగి పెట్టెలోసంగ్రహించి। యఖలేఁదాళంబునునిచి చిక్కలపరిం
చి। యంబయస్థులకుపచారమాచరించె । నోడమెకును బోలెగురుభర్తృఁడూ
రుభవుఁడు॥ వ॥ ఆయస్థిపేటికయు లోహండియుఁదండులంబులు గంబళంబులుం
దగినసంబడంబునువహించి యొక్కరుండును దెరువుతోడునం బెక్కుదేశం
బులుగడచి హావిష్యాశనుండునుస్థండిలశయనుండును నై పథశ్రాంతినభిఘాత
జ్వరంబుసోకినలెక్కసేయక తలఁటిమినడచి మార్గమధ్యంబున నొక్కవేఁటప
ల్లెనొక్కయాటవికునికిభృతియిచ్చిమాటమోపించుక "ని మెట్టకేలకుం గాశీ
పట్టణంబు చేరి॥ క॥ ఆనందవనమునందొక । వానెవణిజునింటనుండి వైశ్యుం
డుపదా । ర్థానయనార్థము పోయెం । దానొక్కఁడు హట్టమునకుఁ దదవ
సరమున॥ వ॥ మూటలోఁదామ్రసంపుటకంబున ధనంబున్న యది యని చెం
చువంచనాపరుండై బొక్కసం బెత్తుకొని తప్పఁ దెరువునుంగాఁ దనపల్లెకుం బో
యె నిటఁ గోమటియును॥ ఉ॥ అంగడినుండి బియ్యము పదార్థములుం గొని వ
చ్చి దప్పిమై । నంగముదూలనుస్సూరనుచు నల్లనఁ గోమటిసెట్టిమందిర। ప్రాంగణ
సీమవేదిపయిఁ బందిరినీడను విశ్రమించి పి । ల్చెంగటముంబ్రసేనమును జెచ్చెర
దెమ్మని బంటు మ్లేచ్ఛునిన్ ॥ క ॥ పిలిచి ప్రతివచనమొదవమిఁ । గళవళమునని
ల్లుసొచ్చి కానకచేర్వన్ । నెలవునఁ గానక వైశ్యుఁడు । నలుమూలలు వెదకి నె
మ్మనముదలఁకొందన్॥ గీ॥ అస్థిగర్భితతామ్రపేట్యన్వితమగు । బొక్కసం బె
త్తికొనిపోయె బోయయనుచు । జననిఁదలఁచి ప్రయాసంబుసంస్మరించి॥ మో
సదర్కించియు వైశ్యముఖ్యుఁడేడ్చె॥ సీ॥ మధ్యాహ్నకాలంబు మందాకినీవా
రి నభిషేకమొనరింపనబ్బదయ్యె। శివునివిశ్వేశ్వర శ్రీమన్మహాదేవు మదనారి
వీక్షింపనోడవదయ్యె। దండపాణినికుంతిదక్షిణామూర్తిని గాలభైరవుఁ గొల్వ
గలుగదయ్యె। శ్రీవిశాలాక్షికిఁ జేదోయి మొగిడించి శిరసు పైఁగూర్పంగఁ దొ
రకదయ్యెఁ। గోమటికిఁదల్లియస్థులకొకమూట । పాపకర్ముండు చెంచర్థభా
రమనుచు । వంచనాపాటవంబునఁ గొంచుఁబోయి। యారివేరంబు చేసినకార
ణమున॥ శా ॥ జాలింబొందియు దప్పిఁ జెందియు బుభుక్షా వేదనం గుందియున్।
వ్యాళాభీలకరాళతీవ్రతరమధ్యాహ్నార్కరోచిశ్ఛటన్ । జాలంగందియునుండి
రాఁబుఁడరిగె సారంభ శుంభద్గతిన్। వైలక్ష్యంబునఁ జెందు వెంటఁజననీవాత్స
ల్యానిఘ్నాత్మతన్॥ వ॥ అంతకమున్న యొక్కకాంతారాంతరంబున నమ్మూట
విడిచి యామూటవికుండు పెట్టె దెఱచి యస్థిశకలంబులు చూచి తనవృథావస్థ
కుం జిన్నఁబోయి యవియు చోటనపారంజల్లి తనపల్లెకుం బోయి మఱుఁగుపడి

యుండైనఁ జయుండును నప్పుణ్యక్షణంబున కేతెంచి॥ గీ॥ చెంచు నింటికిఁ బోయి
చెంచెతకుఁ బ్రియము । చెప్పి నమ్మించి తలమీఁదఁ జెయ్యి వెట్టి । వెఱకుమని
తన్ముఖంబున నెఱుఁగుఁ దేని । గాంచి యాతని తోడ సఖ్యంబు సేసి॥ వ॥ అతఁడుం
దానునుం గూడి యయ్యస్థిశకలంబులు పారంజల్లిన కాంతార ప్రదేశంబున కే
తెంచినప్పుడు॥ గీ॥ ఎమ్ముకలు చల్లినట్టి చోటెఱుఁగఁడయ్యె । దైవవశమున
నాభిల్లతస్కరుండు । దిగ్భ్రమంబెత్తి యుండంద తిరుగుచుండెఁ । గానలోపలన
చోటుగాన లేక॥ క॥ వచ్చిన చోటికి వచ్చుం । జొచ్చిన కాననము చొచ్చుఁ
జోరపుళిందుం । డచ్చోన స్థలుగానక । యచ్చెరుపడెఁ దైవమతిములవియల్ప
ములే॥ వ॥ అయ్యాటవికుండప్పనడచుకొనికిరాటుండు బహుళక్షుత్పిపాసా
పరవశుండయి హాహాకారంబు సేయుచుం గ్రమ్మఱం గాశీపురంబునకరిగి తనమం
దభాగ్యత్వంబు ప్రకటించుచు మందాకినీస్నానంబు సేసి మరలి నిజస్థానంబునకుం
బోయెం గావున॥ గీ॥ అనఘచారిత్ర విశ్వేశ్వరాజ్ఞఁ గాని । రాదు వారాణసీనగ
రంబుఁ జొరఁగ । బలిమిఁ జొచ్చిన యేనిన ప్పంచజనుఁడు । పడనిపాటులఁ బడువి
ఘ్నపజ్క్తిచేత॥ అనుటయు॥ గీ॥ కార్తికేయ కృపాబుద్ధిగలిగెనేని । శ్రవణ
యోగ్యుండనేను నవుదునేని । నానతీఁదగునానంద కాననమునఁ । బ్రతివసిం
చిన క్రోధభైరవుని మహిమ॥ వ॥ అనినం గుమారుండు మైత్రావరుణికిట్లనియె॥
క॥ వారాణసీకథాశ్రుతి । పారాయణుఁడైన పుణ్యపరునకు నీకు । న్నేరిచిన
భంగిఁ జెప్పెద । భైరవచరితంబు వినుము పరమమునీంద్రా॥ గీ॥ హస్తముల రెం
టనందంద నదిమి యదిమి । తాటిపండారగించెడు చీటకమున । సత్యయంబున బ్రి
హ్మాండమాస్వదించు । భైరవుండిచ్చఁ గాత శోభనము మనకు॥ మ॥ క్షయకా
లంబున సింధుసాగరరసాస్వాదాతిరేకంబునన్ । నయనాబ్జంబులు ఘూర్ణితంబు
లుగ సంధ్యా కాలరాత్రీకర । ద్వయ తాళానుగతి ప్రకారమున నవ్వారిన్మహానృ
త్తముం బ్రియమేపారఁగ నాడు భైరవుఁడు గల్పించున్మహైశ్వర్యముల్॥ వ॥ అని
తత్కథాకథన ప్రవీణహృదయుంబున నిట్లనియె॥ క॥ హాటకవసుంధరాభృ । త్కూ
టస్థలియందుఁ దొల్లిఁ గొలువుండెనిరా । ఘూటవిభవాభిజృంభిత । హాటకగ
ర్భుండు జగములన్నియుఁ గొలువన్॥ వ॥ అయ్యవసరంబునం దత్సభాసదుల
గు మునీంద్రులప్పరమేష్ఠికిం బ్రణామిల్లి యిట్లనిరి॥ గీ॥ వరదవాగ్వధూవల్లభ వన
జగర్భ । యడుగఁగలదొక్కసంశయి తార్థమిప్పు । డవ్యయంబగు తత్త్వమె
య్యదియొ తెలియ । నంత వట్టును నీవు సాకానతిమ్ము॥ వ॥ అనిన విని భారతీ
శ్వరుండు శ్రీమహాదేవమాయా మోహవశంబునం బరమాత్మవివేకంబు లేక
వారిం జూచి జగద్యోనియగు నేనొక్కరుండ నయీశ్వరుండ నాకధీశ్వరుండు

లేఁడుమీఁదివిద్విధంబు దెలిసియవ్యయతత్త్వంబునన్న కాళ్ళవీఁపుండనియె నదియ్యో
హంకారంబు సహింపకతత్సమీపంబుననున్న విశ్వంభరాంశ సంభవుండగు బ్ర
తుపురుషుండు గుటిలభ్రూకుటిదుర్నిరీక్ష్యుండు గోత్రధరామాత్యుండునగుచు
నతనికిట్లనియె॥ క॥ పరతత్త్వమెఱుఁగఁగారక । పరమర్షులతోఁడ నేనపరముండ
ననుచుక్ష। సురలెల్లగాకు సేయఁగ। దురహంకృతిఁబలుకఁదగునె తోయజగ
ర్భా॥ వ॥ వినుమేను సాక్షాన్నారాయణాండను యజ్ఞపురుషుండ జగత్ప్రభుండన
వ్యయతత్త్వశబ్దవాచ్యత్వంబు నాయందు సుప్రతిష్ఠితంబు నీవిటవలని పెద్దరికం
బున నడచిపడకుండుమనియె నిట్లిద్దఱు బరస్పరజయార్థులగుచు వాదడచియు
డచి తమతారతమ్యం బామ్నాయంబుల నడిగిరవ్వాడు ఋగ్వేదంబిట్లనియె॥
సీ॥ నవరించు నెవ్వఁడు జఠరగోళంబునఁ బొడవడంగక యుండ భూతగణము। నె
రయించు నెవ్వఁడు నిజసనాతనమాయ సకలప్రపంచంబు సంతతముగ। నివ
సించు నెవ్వఁడు వివిధోపనిషదర్థహర్మ్యాగ్రములయందు నహరహంబు। చరి
యించు నెవ్వఁడు శాశ్వతమంగళ ప్రోద్దంతురార్భటి నొక్కరుండు। నహ
హాయుయ్యాది దేవుఁడనామయుండు। రుద్రుఁడవిచింత్యుఁడాద్యుఁడరూపుఁ
డుండు। నవ్యయంబగు తత్త్వమేననవళంబె। యన్యునకు నెట్టివానికి వనఘు
లార॥ వ॥ అనవుడు యజుర్వేదంబిట్లనియె॥ సీ॥ సకలాధ్వరక్రియాసంచయం
బులఁజేసి ఇజ్యమానుండగు చెప్పఁడలరు। నధ్యాత్మవిద్యారహస్యమార్గం
బునఁ దక్క నెవ్వఁడుగానఁదరముగాదు। మాయందుఁగరముప్రామాణ్య
విశేషంబు లెడపకుండఁగఁజేయు నెవ్వఁడిపుడు। ప్రకటకూటస్థస్వభావతన
ఖలంబు గదలకెవ్వఁడు సమీక్షణమొనర్చు। నట్టిశివుఁడొక్కరుండుగాకర్హుఁ
డగునె। యవ్యయపుదత్త్వమను సమాహ్వయముఁదాల్ప। నితరుఁడెంతటివాఁ
డగు నేతదర్థమాత్మ సంశయింపకుఁడు ధర్మాత్ములార॥ వ॥ అనిన సామవేదం
బిట్లనియె॥ సీ॥ విశ్వంబు నెవ్వని విపులక్రియాశక్తిఁదిరుగుచున్నదితీఁగ తెంపు
గాఁగ। జంతింతు రెవ్వనిఁ జిత్ప్రకాశాత్మకుఁ బరమార్థవిదులు తాత్పర్యమొ
ప్ప। రవిసుధాకరశిఖిగ్రహముఖ్యముల కెల్లభాసకం బెవ్వనిభవ్యతేజ। మితర
దుర్ధరమగునీశ్వరశబ్దంబు దలఁచియెవ్వనిఁ బాయదలఘులీల। నతఁడు మరణో
ద్భవవ్యవహారదూరుఁ। డజుఁడు ఫాలాక్షుఁ డిందురేఖావతంసుఁ। డవ్యయపుఁ
దత్త్వమగుఁగాక యల్పులొరుల। కమ్మహత్త్వంబు గలుగునే యనఘులార॥
వ॥ అనిన నథర్వవేదంబిట్లనియె॥ సీ॥ ఎవ్వనికరవణెల్లు నెల్లజీవులయందు బూ
సలలోనున్న బొందువోలె। నెవ్వనిఁ బొడగంద్రు హృత్పద్మపీఠులభక్త్యను
గ్రిష్ణమునభవ్యజనము। లెవ్వఁడు వికసిల్లునింతయుఁదానయ్యు నేమియుఁ

దాఁగాఁక యేక హేళి। నెవ్వనిసద్భావమిదమిత్థమని చెప్పఁజాలవు నేఁడునుశా
స్త్రఘణాతు। లతులకై వల్యమంగళాయతనమభవుఁ। డపరితర్క్యుఁడుశం
కరుఁడపరిమేయుఁ। డతఁడయవ్యయంబగుతత్త్వమనిఁదనర్పు। మఱువుఁడో మం
దుతలంపులుమహితులార॥ వ॥ అనియిట్లుచతుశ్శ్రుతులుపన్యసించినవినివిరిం
చిమఖపురుషులాహా పరేతనిలయంబునంగాంతాపరవశుండైయుండు ప్రమ
థనాథుండెక్కడనవ్యయతత్త్వం బెక్కడఁ బరబ్రహ్మభావంబలేని కెట్లుసమకూ
ఱుమీమాటలుప్రాసంగవను నవసరంబునఁబ్రణవంబుమూర్తిమంతంబై వారి
కిట్లనియె॥ క॥ శితికంఠుఁడలఘులీలా। ధృతవిగ్రహుఁడట్లుగానఁ దెల్లంబాత్మా। వ్యతి
రిక్తయగుసరోజా। యతిలో చనతోడఁగూడఁడతఁడెన్నండున్॥ గీ॥ అర్ధశశిభూ
షణుఁడుస్వయంప్రభుఁడుఁ। డున్నతుండునితోర్జితజ్యోతియుతని। సంతతానం
దశక్తియాసరసిజాక్షి। విశ్వజనయిత్రివారికి వేఱులేదు॥ వ॥ అనియివ్విధంబు
ననంతసెప్పినవిధాతృమఖమూర్తులంజట్టుకొన్న యజ్ఞానతిమిరంబుదొలంగ
దయ్యెనప్పుడుదశదిశావకాశ పరిపూర్ణంబగు నొక్కయఖండదివ్య తేజంబు
వారలనడుమనుద్భవించెననంతరంబతన్మధ్యంబునందు॥ సీ॥ కటిభాగమునగం
ధకరటిరాట్చర్మంబుకపటంపుఁజిమ్మచీఁకట్లనీన। వక్షస్థలంబునఁజతుర్శ్రవో
భర్తతారహారముతేవదళుకుఁజూపఁ। గేలుదామరయందుశూలముద్భటనట
జ్జ్వలనకీలములవసంతమాడ। జూటదూటమునందుసొబగులేఁజందురు డాక
తోరసారచంద్రికలుగాయఁ। గుటిలనిర్ఘాతఘుర్ఘురఘోరఘోష। పరణిడమరు
ధ్వానానాదంబుపరిధవిల్లఁ। బురనిశాటవిపాటనస్ఫుటవిహార। ధూర్భరుండగు
హరుఁడుప్రాదుర్భవించె॥ వ॥ ఇట్లావిర్భవించినయవ్విరూపాక్షునిరీక్షించియు
విరించిమరహంకారంబుడుపనేరక పంచమవదనంబుననిట్లనియె॥ గీ॥ డమరుధ
రనీవునాలలాటస్థలమునఁ। బొల్చిజనియించితిది తేటతెల్లఁగాఁగ। రోదనము
సేసితివుగనీకురుద్రనామ। మపుడుఘటియించినాఁడసేనలఘుమహిమ॥ వ॥ అ
ట్లుగావునసీవునాకుం బుత్రుండవు నన్నుశరణంబుఁజొచ్చి నావలనంబరిరక్షఁ
గాంచిబ్రదుకుమనుచుమధురాలాపంబులువలికెభర్గుండును నఖండంబగుతదీ
యగర్వంబుసహింపకనితాంతరోషసంరంభంబున విజృంభించెన॥ సీ॥ ధమ
ధమార్భటీసముద్ధమరఢక్కాధ్వనిపదిదిక్కులందును భ్రమరివార। గళమూ
లనిగళశ్యామలకూటచ్ఛవియర్కబింబంబుమాయంబు సేయ। ఫాలదృగ్భ
వసముద్భటశిఖాజాలంబులుదధులనన్నింటినుడుకఁబెట్టఁ। గుటిలపాటలజటాం
కురకుట్టనంబులు జగదండసీమ బెజ్జములువుచ్చ। సంభవమునొంద శౌరుసవ
స్తంభరభస। శుంభదవగాఢరోషవిస్ఫురణవలన। విశ్వసంహారసన్నాహవి

షమసుషమ। పరుషదుర్భైరవుండగుభైరవుండు॥ వ॥ ఇట్లుద్భవించియుద్భ
టప్రతాపదుర్నిరీక్ష్యుండగుచు సత్వరంబవిరూపాక్షునాజ్ఞాపనంబునం బద్మ
గర్భునిం గదిసి॥ గీ॥ గంధకరటిమూర్ధ్నకమలంబుఁ బోలెన। ప్పురుషుండలసలీల
వాటకరింపఁ। ద్రుంచెనవ్విరించి పంచమవదనంబు । ప్రఖరదీర్ఘవామహస్తనఖ
రధార॥ గీ॥ ద్రోహియాయుంగమట్టివిరూపడంపఁ। దగవుగావునదూషకత్వం
బుదెలిసి। తునిమెంబరమేష్ఠిపంచమాననమయేర్చి। భైరవుండింతయొప్పైనపా
డిగలదె॥ వ॥ అట్టియెడనారాయణాంశజుండయిన క్రతుమూర్తిశైవంబులై
న స్తోత్రంబులుపఠించె హిరణ్యగర్భుండును నహంకారంబుడిగి భీతివశంబునశ
తరుద్రీయంబుజపించె నంతశరణాగతవత్సలుండగునయ్యీశ్వరుండు వారినిద్ద
ఱింగరుణావిలోకనంబులమన్నించి నిజరూపాంతరంబైన భైరవదేవుంజూచి
యీయధ్వరపురుషవిధాతలునీకు మాననీయులు వీరలయెడనింకఁ గోపాటో
పంబులుచాలునీవువైధసంబైన కపాలంబుదాల్చి లోకాచారప్రకటనార్థంబు
భిక్షాశనంబు గొనుచుం గాపాలికవ్రతంబుతోడలోకంబులం జరియింపుమని
చెప్పి యనంతరంబ॥ సీ॥ మోకాళ్లుదిగఁబండముడిచికట్టిన ధాతుశాటంబుగ
లకటిస్థలముతోడ । దట్టంబుగాఁగఁజందనపంకమలఁదిన యరుణంపువికట
దేహంబుతోడఁ । బిల్లికన్నులఁబోలుపింగళాక్షములందుఁ గ్రూరంబులగు
మిడిగ్రుడ్లతోడఁ। బొదఁగట్టువడుజపాపుష్పంబుచెరివిన చికిచికిపల్లవెంద్రుక
లతోడఁ। గఠినదంష్ట్రికాభీలవక్త్రంబుతోడ । జహ్మనటనత్వరోల్లలజ్జిహ్వ
తోడఁ। గత్తితోఁబట్టితోమహాహుగ్రత్వమొంద। ఫాలనేత్రుండుసృజియిం
చెబ్రహ్మహత్య॥ వ॥ ఇట్లుసృజియించిదానింజూచి గాశికానగరంబు దక్కని
తరస్థలంబులెవ్వియునీకుదుష్ప్రవేశంబులుగావు నీవితనివజ్జ వర్తిల్లుమనుచుఁ
బుండరీకభవశిరఃఖండనుండయిన భైరవుంజూపి యంతకాంతకుం డంతర్ధానం
బు సేసెనతండునునీశ్వరోక్తప్రకారంబున సకలజగమ్ములు గ్రుమ్మరుచు నొ
క్కనాఁడువైకుంఠపురంబుచొచ్చి వైకుంఠనికేతనంబునకేగిన ॥ సీ॥ పదప
ల్లవంబునఁబ్రకటిల్లుచదలేఱు కడలెత్తిధాత్రివెల్వాడిచిపాఱ। గటియందురం
జిల్లుకనకశాటిచాలంగు గొళవుల రేయెండతళుకులీనఁ। బొక్కిటినెత్తమ్మిపూ
వునమునరెడునలులురుపమ్మనుచుసంకులతఁదిరుగఁ। దులసీపలాశమంజలదా
మకంబులుగౌస్తుభపదకంబుగ్రందుపఱుప । సంభ్రమమువిస్మయంబును స
మ్మదంబు। భక్తియునుభావవీధిలోఁబరిఢవిల్ల । నిందిరయుఁదానుబద్మాక్షు
డెదురువచ్చె । భర్గమూర్తికినయ్యాదిభైరవునకు ॥ వ॥ ఇట్లువచ్చియాల
క్ష్మీశ్వరుండగ్రభాగంబున॥ మ॥ కనియెంగుండలిరాజకుండలుమహాకాలుఁ

లలాటస్థలీ। జనితానల్పకృపీటసంభవపటుజ్వాలాకరాళాత్ముఁ బా। వసునింబ్రబి
వ్మ్లాకపాలహస్తునిజటావ్యాఘ్రాకవప్రౌఢది । వ్యనదీపార్శ్వహారీపరస్పరహాతి
వ్యగ్రాకవుఁ భైరవుఁ॥ వ॥ కనిజయజయశబ్దముఖరుండగుచుం గదిసి ప్రణామి
ల్లి యంజలిపుటంబు నిటలంబునం గదియించి తత్ప్రభావవర్ణనా కుతూహ
లంబున నిందిరాదేవి కిట్లనియె॥ సీ॥ జలజాక్షి యితఁడువో సకలయోగీంద్రులు
భావవీథులఁ గాంచు పరమతత్త్వ । మలివేణి యితఁడువో యఖిలభూతములకు
నాధారమగుచు నిండారువేల్పు। కలకంఠి యితఁడువో విలయకాలమునందు
నుడివోని శుభమూర్తి నుండు పెద్ద। లలితాంగి యితఁడువో యలఘు తేజంబు
న విశ్వంబు వెలిఁగించు విశ్వనాథుఁ । డబ్ధిసంభవ యితఁడు వో హాలహాలవు
విషము పుక్కిటఁ దాల్చిన వెంగలీఁడు। పాటలీగంధి యితఁడువో భక్తతతికి శా
శ్వతానందకరుఁడగు నీశ్వరుండు॥ క॥ మనమెట్టి భాగ్యమొనరిం। చినవార
మొ నేఁడు పూర్ణశీతాంశునిభా। ననయట్లుగాక శంభుఁడు। వినవచ్చెరువిచ
టికిట్లు విజయం చేసెన్॥ వ॥ అనిపలికి యప్పరమేశ్వరుండు వెండియు ననేకప్ర
కారంబుల బ్రస్తుతించి యతనివలనఁ దదీయభిక్షాటన వృత్తాంతంబంతయు
నెఱింగి యాశ్చర్యహృదయుండగుచుఁ బద్మమందిరకు సంజ్ఞ సేసిన నాజగన్మా
తయు నంతఃపురంబునకుం జని యనంతరంబ॥ సీ॥ అడుగుదమ్ములయందు న
డరు నున్నని డాలు కపటసంధ్యారుచిఁ గ్రిమ్మరింపఁ । గాంచీమతల్లికా కలక
లారవములు ఝుషకేతు పట్టపాసముల నవ్వఁ । కుచకుంభయుగళి వ్రేఁ
గునఁ దొట్రుపడి పేద కౌఁదీఁగ జవజవఁ గంప మొంద। గుఱియి లెక్క జాఱిన క్రొ
మ్ముడిలోపలి విరులు తుమ్మెదలకు విందు వెట్ట। సహజసంభ్రమ తాత్పర్యసమ్మ
దములఁ దళుకు చూపంగ నవరత్నదర్వి గొనుచు। నిందిరాదేవి యేతెంచి యిం
దుధరుని। హస్తపాత్రికనమృతభిక్షాన్నమిడియె॥ వ॥ ఇట్లు మహాలక్ష్మీదేవి చే
త మనోరథవతి యను పేరం బ్రసిద్ధి యగు భిక్షఁ గొని పద్మాక్షునందలి భయభ
క్తివిశ్వాసంబులకు మెచ్చి యతనికోరినవరంబు లొసంగి యప్పటియట్ల బ్రహ్మ
హత్యతోడన యేగు దేరఁ జగంబులఁ జరియించుచు నొక్క నాఁడు॥ సీ॥ జనని యే తీ
ర్థంబు సకలదుఃఖావళీ హరణప్రభావవిస్ఫురణమునకు । గృహిణి యే తీర్థంబు
మహితహాలాహలగరళచ్ఛవిచ్ఛన్నకంధరునకు । నావాసమే తీర్థ మభినుత
ప్రదకళాకరవిశాలాక్ష్యాఖ్య కల్పలతకు । నావాసమే తీర్థమఖిలతీర్థాలభ్య
ముఖ్యసౌఖ్యావహ మోక్షమునకు। నట్టితీర్థంబునకు నెమ్మి నరుగుదెంచెఁ। గాశి
నగరికి నికటభాగప్రకీర్ణ । గగనగంగాతరంగిణీకనకకమల। పరిమళోద్గారణికి
మహాభైరవుండు॥ వ॥ ఇట్లు దేవుండు విశ్వేశ్వర నివాసంబు సొచ్చినంతన బహి

ర్భాగంబుననుండి యూకారంబున మొఱవెట్టిచు బ్రహ్మహత్యపాతాళం
బునఁబడియెనతనిహస్తంబుననున్న కపాలంబునుసూడి ధాత్రీతలంబునంబడి
యె నదిమొదలుగానవ్వటుకనాథుండానందంబున నయ్యానందవనంబునంద
వసియించెఁగపాలమోచనతీర్థంబు దన్నుభజించువారికిం బాపభంజనంబు
సేయుచుఁబుణ్యప్రదాయకంబయ్యె నియ్యాఖ్యానంబువిన్ననుబఠించిననుమ
హాపాతకంబుదొలంగుననిచెప్పి కుమారస్వామి వెండియునగస్త్యునకిట్లనియె॥
సీ॥ అజుఁడుదానధికుండనను చుగర్వించినఁ గరనఖాగ్రమునఁదచ్ఛిరమ్ముద్రుం
చె। సాకారమగుబ్రహ్మహత్యతోఁజను దేరసకలలోకంబులుసంచరించె। వై
కుంఠముననరనూర్వైకుంఠులర్పింప నమృతభిక్షాశనంబారగించెఁ। గాశికానగ
రోపకంఠదేశంబునఁబగలవైచెఁ గరంబుబ్రహ్మపునుక। యాధిపత్యంబువడ
సెఁగామారిచేతఁ। బుఱియవైచినచోనకాపురముసేసెఁ। గాశికాస్థానమున
కేడుగడయుఁజూవె। క్రోధభైరవదేవుండుకుంభజన్మ॥వ॥ దురితభక్షణంబునం
బాపభక్షకుండునుఁ గలుషమర్దనంబుననామర్దనుండును గాలకలనంబునఁగా
లనాథుండునువృజినభైరవుండ గుటభైరవుండునునైయద్దేవుండుభజించువా
రికిషాణ్మాసిసిద్ధికరుండు॥ గీ॥ కలశయోనియవ్వేటికిఁ బలుతలారి। పాపహ్
వైర్భైరవుఁడుగ్రోధభైరవుండు। గాశికాపట్టణంబైదుక్రోశములను। నవహి
తుండైయతండుచేటచ్చికాచు॥వ॥ అనినవినికుంభసంభవుండు హరికేశుండ
ను యక్షుండు దేవదేవునకుం బ్రేమపాత్రంబై వారాణశీపట్టణంబునం బ్ర
మథపరివారంబునకు దండనాయకుండయి యుండుననివిందు నతనిచరిత్రంబు
వినవలతు నానతిమ్మనినఁ గుమారస్వామి యాతనికిట్లనియె॥సీ॥ యక్షుండుర
త్నభద్రాభిధానుఁడు గంధమాదనంబుననుండు మహితకీర్తి। పూర్ణభద్రుం
డుతత్పుత్రుఁడాతనిభార్య కనకమండనగంధకరటియాన। యాలేమతనయుం
డుహరికేశుఁడతఁడు శ్రీయానందకాననాభ్యంతరమునఁ। దపమాచరింప
నాతనిశరీరముముంచిపుట్టైవల్మీకంబుపొదలువొదలెనభవుఁడుమతోడఁగూ
డిలీలార్థమచటి। కరుగుదెంచిప్రసన్నుఁడై వరమునొసఁగె। దండనాయకప
దవియాతుఁడుగాశి। చక్రరక్షకుఁడై యుండుజనువుగలిగె॥ సీ॥ ధరియించు
నాతండుపాణిపల్లవమున వెండికట్టులతోడిదండయష్టి। వసియించునాతండు
వారాణశీపుర ప్రాకారగోపురప్రాంతభూమి। ధరియించునాతండు దప్త
రకూటరుక్పరిపాటలచ్ఛాయఁబ్రబలజటలు। నవరించునాతండుసతతంబురు
ద్రాక్ష భూషావిభూతి త్రిపుండ్రకములు। సౌమ్యరూపంబువహియించునస
జ్జనులకుఁ। బాపమతులకు వికృతరూపంబుదాల్చు। బింగళాక్షుండుదీర్ఘగంభీ

రమూర్తి। చండికాపతి ప్రమథుండు దండపాణి॥ వ॥ అనినన గస్త్యుండు మహా
త్మా జ్ఞానవాపికాతీర్థ మాహాత్మ్యంబు వినవలతుం జెప్ప వేయనినం గార్తికే
యుండు॥ సీ॥ పాదాభిహతిసప్తపాతాళములతోడ నుర్వీకటాహ ముబ్బూఁత
లూఁగ। నిబిరిసతతఝటానికురుంబకంబులు చెదరి బ్రహ్మాండంబు చెంపవెట్ట।
బాహార్గళాస్తంభ పరివర్తనంబుల దిక్చక్రవాళంబు ద్రెల్లిపడఁగ। వితతని
శ్వాసమారుతఘట్టనంబునఁ బృథ్వీధరంబులు పెల్లగిల్ల। డమరుధ్వాన్నాదములస
ముద్రములు గలఁగ। నారభటివృత్తిఁ దాండవంబవధరించెఁ। ప్రళయవేళ మహా
కాలభైరవుఁడు కాళరాత్రికుచంబులుగ గుఱుపాడువ॥ గీ॥ అథవుఁడిబ్బంగిఁ
దాండవం బాడిడస్సి। దప్పిగొని యారగింపఁ గాండంబు వెదకి। కానఁడయ్యెను
సప్తలోకంబులందుఁ దియ్యనై జిహ్వకింపైన తేటనీరు॥ గీ॥ ప్రళయకాలంబు
నందును బసిమి చెడక। నిలిచినది కాశీపురము కానిశ్చయించి। యరిగె నీశానుఁ
డను సమాహ్వయము దాల్చి। ఘనపిపాసార్తి నంధకదనుజవైరి॥ క॥ కన్న
వారెవ్వరును లేరు కన్నె మెఱుఁగు। గర్జితంబను వచనంబు గథల నిలిచె। శశ
విషాణప్రరోహంబు జలదవార్త। యంబు లెబ్బంగిఁ గలుగునయ్యవసరమున॥
వ॥ అప్పుడీశానుండు॥ సీ॥ సంసారసస్యబీజములకూషరభూమి నిర్వాణలక్ష్మి
కినిలువనీడ। యల్లనేరెడుదీవికవతంసకుసుమంబు కామధేనువు ముక్తికా
ములకును। విహరణస్థానంబు విశ్వనాయకునకుఁ గల్యాణముల కాదికార
ణంబు। కట్టుఁగంబము కుంభి గంధద్విపమునకుఁ బ్రణవాక్షరము పరబ్రహ్మ
మునకు। నెద్దియు కాశికాపురి కేగుదెంచెఁ। బసిఁడిలాతాపుకోలయు బల్ల
జడలు। నసితగళమునాలమును ద్రిశూలాయుధంబుఁ। జాలనొప్పంగఁ ద
పసివేషము నహరుఁడు॥ వ॥ ఇట్లు కాశీకానగరంబు ప్రవేశించి యీశానుం
డు విశ్వేశ్వర శ్రీమహాదేవు నిర్మలజ్యోతిర్మయలింగాకారు సహస్రకలశాభి
షేకంబు సేయను దత్పాదతీర్థ ప్రసాదోదకంబు లాస్వాదింపను దలంచి॥
శా॥ చేతోజాతవిరోధి గాశినగరీక్షేత్రోపకంఠంబునన్। శాతాగ్రంబగుశూ
లమూఁది ధరణీచక్రంబు భేదించుచున్। బాతాళంబులు ద్రొచ్చుచున్ని
గుడనాభవ్యాయుధంబావృత। స్రోతోభారము సోఁకునట్లుగ దృఢస్ఫూ
ర్తిన్ బ్రభావంబునన్॥ గీ॥ దృఢముగా నూఁది శూలంబు దివిసె హరుఁడు
దివిసినప్పుడ తన్మహావివరసరణి। నేఁడు పాతాళములు దాఁటి యిలయుఁ
దూఁటి। యంబరము దాఁకె నవ్వరుణాంబుధార॥ వ॥ భూప్రమాణంబున
కు దశగుణప్రమాణంబై శుద్ధస్ఫటికనిర్మలంబును శరజ్జ్యోత్స్నాస్వచ్ఛంబు
నునాకాశఖండసంకాశంబును సుధాధారామధురంబును బాటలాకుసుమసుర

భియునై యవ్వారిపూరంబు వెండితీఁగయుంబోలె నెగసిన నీశానుండు సహస్రధారాకలశంబుల సహస్రవారంబులు పంచాక్షరీ పంచబ్రహ్మ శతరుద్రీయ ప్రణవఘోర పాశుపతాది మంత్రంబులుచ్చరించుచు విశ్వేశ్వర శ్రీమన్మహాదేవు దివ్యలింగంబు నభిషేకించి॥ క॥ భువనావనహేతోదకమున । భవునభిషేకంబు సేయఁ బాసెనులయతాం। డవకేళీసమయసము। ద్భవమగు నీరసృట్టుగ పటపాశుపతునకున్ ॥ వ॥ అప్పుడు విశ్వేశ్వరుండు ప్రసన్నుండై యీశాను కోరినప్రకారంబున॥ సీ॥ జ్ఞానోదమన శివజ్ఞానంబునా శివతీర్థంబునా జ్ఞానతీర్థమనఁగ । జ్ఞానవాపికి నాఁగసంజ్ఞాంతరంబులుగలిగిపానాభిషేకక్రియలను । సుస్పర్శనామాభి సంకీర్తనధ్యానసందర్శనంబులసతతంతు। ఫలమునీఁజాలు ప్రభావంబు గైవల్యసంపత్ప్రదానైక చతురతయును । సన్నిహత్యాది ఫల్గ్వాదిసకలతీర్థ । సముధికత్వంబు బ్రహ్మరాక్షసపిశాచ । శాకినీగ్రహకూశ్మాండశాంతివిధియు । నిచ్చె నీశానకుండికి కీశ్వరుండు॥ వ॥ అనియీనతిచ్చిశంభుండంతర్హితుండయ్యెనీశానవాపికాసమీపంబున నీశానుండు కృతావాసుండయ్యెఁ గలశోద్భవ చిత్రార్థంబగునితిహాసంబుశివతీర్థమాహాత్మ్యప్రకారంబుసెప్పెద నాకర్ణింపుము హరిస్వామియనఁగనొక విప్రుండు కాశీనగరంబుననుండు నతనికూతురు సుశీలయనునది రూపరేఖావిలాసంబులం ద్రిభువనంబులయందునుం బొగడందగియుండు నబ్బాలారత్నంబు॥ చ॥ బలబలవేగత్రేపకడఁ బంకజదీర్ఘికఁదీర్థమాడినె। చ్చెలులును దాను నిందుముఖశేషవిభూషణుఁబూజ సేయుని । చ్చలుదెలికన్నులునొమ్మలకచన్నులుబొమ్మలమీఁదవ్రాలుగుం। తలములుఁజూచి పౌరులుమనంబులనువ్విళులూరుచుండఁగన్॥ గీ॥ లలనసాక్షాత్కరించినలక్ష్మివోలెఁ గంకణంబులతోఁసూడిగములురాయ । విశ్వనాథునికల్యాణవేదియందు । ముగ్గువెట్టంత మోహించు ముజ్జగంబు॥ గీ॥ బహుళసౌభాగ్యలక్ష్మినిఁబద్మముఖకి । ముజ్జగంబుల సరిలేరు ముదితలనుచు । బ్రహ్మసంకేతరేఖలువ్రాసెననఁగ । గాంతగళమున నొప్పెరేఖాత్రయంబు॥ గీ॥ కడుపుగోమూఁడు శంభులింగంబులుండఁ। దొయ్యలికిజ్ఞానవాపికాతోయసేవ । గలశసంభవ కేదార సలిలములును। గాశిశివతీర్థజలములింగత్వమొందు॥ వ॥ ఒక్కనాఁడొక్క విద్యాధరుండు రూపలావణ్యమోహితుండై యర్ధరాత్రంబమ్మచ్చెకంటి ముంగిటబిండివల్లిన విధంబున వెన్నెలలుగాయఁ జంద్రికాపాండుతల్పంబున నిద్రించియుండ నిద్రాభంగంబుగాకుండ మెత్తమెత్తన నెత్తమ్మిరేకులకంటెనునుసుకుమారంబులై నతనహస్తపల్లవంబుల నెత్తిగగనమార్గంబునమలయాద్రికిఁగొనిపోయె

నయ్యవసరంబున॥ శా॥ విద్యున్మాలియనంగ నొక్కదివిషద్విద్వేషి యక్క
న్యకన్। విద్యుత్సన్నిభగాత్రిఁ జూచి మదనావేశంబునం బట్టుకో। నుద్యోగిం
చిననాలతాంగినొకచో యోజించి విద్యాధరుం। డుద్యద్బాహు పరాక్రమ
స్ఫురణ దైత్యుం దాకెనయ్యుద్ధభూన్॥ క॥ ఆహవము చేసిరంగజ। మోహాం
ధులు గడిమి మెఱసి ముష్టాముష్టిన్। బాహాబాహిఁ గచాకచి। సాహసము జలం
బుది విజసంఘము వొగడన్॥ అప్పుడు॥ గీ॥ అప్సరస్త్రీ తిలోత్తమ యసుర
సురులు। తనకునై పోరఁ జూచు చందంబు దోఁప। జూచె విద్యాధరుఁడు రాక్ష
సుండు గడిమిఁ। దనకునై పోరుచుండఁగాఁ దలిరుఁబోఁడి॥ వ॥ అవ్విధంబున యు
ద్ధంబు సేసి యన్యోన్యముష్టిప్రహారంబుల నిద్దఱు నాసమయంబున నిధ
నంబొందిరందు॥ గీ॥ ప్రాణనిర్యాణవేళ విద్యాధరుండు। గ్రుడ్డుదిరుగంగఁ
బడి విప్రకులజఁ జూచి। కటకటా నిన్ను ననుభుగద్దిక కెలన। మాటనాల్కన
యుండంగ మరణమయ్యె॥ వ॥ అంతనక్కాంత నిజాంతర్గతంబున॥ క॥ ఆలిం
గనంబు సేసెం। బాలిండ్లను ముట్టి వదనపద్మము తావుల్। గ్రోలె మగండన
నెవ్వం। డాలనఁగా నెద్ది భర్తయతఁడే నాకున్॥ వ॥ అనివిద్యాధరుతోడన
ను గమనంబు సేయందలంచి యున్నియమ్మెఱుంగుఁబోఁడి మలయాచలో
పాంతంబున॥ ఉ॥ వెగ్గలమైన కూర్మి నరవిందదళాయతనేత్ర కొండకా। ర
గ్గి పటీర కాష్ఠములయందురవుల్కఁ జేసి కమ్మపూ। మొగ్గలదండ దాల్చి మ
దిమున్కఁడఁగా శివి విశ్వనాయకు। న్డిగ్గన సంస్మరించి జననీజనకుండలఁ జెం
గ్రమంబునన్॥ మఱియు నాత్మగతంబున॥ క॥ ఏమిటఁ దక్కితినొకొ నా। స్వ
మికి విశ్వేశ్వరునకు వారాణశిలో। సేమమున నెల్లరులుదమ। ధామంబుల
నుండనిట్టిదశ నాకొదవెన్॥ సీ॥ జ్ఞానవాపీపయస్స్నానక్రియావేళఁ జెలికత్తె
యలు నన్నుఁ దలఁతురొక్కొ। మదిలోన నేభంగి మఱుఁగుచుండుదురొక్కొ త
ల్లిదండ్రులు నంతతంబు నాకు। హరితాంకురంబు లేవం దీకమేయని హరిణశా
బము నెవ్వరరయువారు। సేవసేయించుకొఁజెత్తగిఁపఁడు సుమీ నాచేత శ్రీవి
శ్వనాయకుండు। కాశిలోలార్క కేశవకాళనాథ। దండనాయకదుంఠి వేదం
డవదన। సంభ్రమోద్భ్రములారయో జహ్నుకన్య। కానవచ్చెద మిమ్ము
ముఁగలిభవమున॥ గీ॥ విధవనై జన్మమెల్లను వేఁగఁజాల। నొకని చేపడి యో
పనొండొకని వెదుక। నితనితోడ దలోకమైయేగుదాన। ననలముఖమున నిమి
షవేదనకునోర్చి॥ ఉ॥ ఇంకొకఁడెవ్వఁడేని నను నెక్కటినుండఁగఁ జూచి పట్టు
నో। కింక మహాటవిం గరటి కేసరిదంష్ట్రితరక్షుయూథముల్। సంకట పెట్టు
నోయటన్నృశంసత నింతులఁ జేసినట్టియా। పంకజసూతిపై నెరయఁ బ్రియ్యెడ

వేగము మున్నె (యో) చ్చెదర్ ॥ క॥ పాపపుదైవ మొనర్చిన । యీపరిభవవహ్ని
కంటె నెక్కుడు పుబునెం॥ తాపమునం జిత్తాకాశో । ద్దీపితమగు నహ్నుయేల
ధృతిం దొఱంగంగన్॥ ఉ॥ భూధరరాజసన్నిభుండు పుష్పశరాసనుతోడఁ జోడు
వి। ద్యాధరచక్రవర్తి ననునన్ముళి దెచ్చినవాఁడు నాకుఁగా। నీధరనాథుకట్టె
దు రనీదశనుండఁగ విశ్వనాథకా। శీధరయంబికారమణ జీవితమేను ధరించు
దాననే॥ అనిదుఃఖావేశంబున॥ చ॥ కొసరి వసంతకాలమునఁ గోయిలగ్రో
ల్చినభంగి జేడ్చెన। బ్బిసరుహనేత్ర కొండచఱిం బెద్దయెలుంగున వెక్కివెక్కి
వె। క్కసమగు మన్యువేగమునఁ గాటుక కన్నులనీరు సోనలై । యుసిరికకాయ
లంతలు పయోధరముల్ దిగు బారునట్లుగన్॥ మ॥ మలయంబెక్కడఁ గాశి
యెక్కడ నసన్నారంబు పాటించితే। క్కలి దైవంబిటు నాకు నీయహితముం గా
వించునే యంచు వే। తలయూచెం గలకంఠయుచ్చైరువునందాటంకరత్నప్ర
భల్। పలుకం బారిన చెక్కుటద్దముల పైఁబై పైవిలంఘింపఁగన్॥ వ॥ వెం
డియునక్కన్యక కర్పూరకదళికాద్రుమనిర్యన్నిర్యాసధారాద్రవ వాసనాసు
గంధంబులగు గంధసారగిరినితంబ నిర్ఝరాంబు ప్రవాహంబుల ముఖశాళ
సంబాచరించి విద్యాధరోపరిక్షిరచిత చితాగంధసారకాష్ఠంబులరవుల్కొనివ
నగంధకరటికర్ణతాళవృంత తాండవ ప్రస్తారవిస్తారితంబులగు మారుతంబుల
వలనం బెచ్చు పెరిగి విచ్చలవిడి మీఁదు విచ్చుననుంబ్రబదక్షిణంబు వచ్చి నిసర్గకా
తరంబులగు కటాక్షవీక్షణంబులు పుష్పాంజలివిక్షేపభంగి నంగీకరింపఁ జంపు
డుగట్టను గుశిలాపట్టంబు మెట్టి నిలిచి సంతతస్వాధ్యాయాధ్యయనధ్వనిముఖ
రంబును నగ్నిహోత్రధేనుఖురఖురవలయార్ధచంద్రకితాజిరంబును ద్రికా
లశంభుపూజాసమారంభ విజృంభమాణశంఖకాహళబహుళకోలాహలాకు
లంబును నగు నయ్యానందకాననంబునందు బ్రహ్మపురివాడకుం జూడారత్నం
బైన నాపుట్టినిల్లభివృద్ధింబొంది యుండుంగాక కాశికాకటకవిప్రకుటుంబినీశ్లా
ఘనీయచరిత్రయగు నాజనయిత్రి ప్రియంవదము త్తైదువయగుంగాత యుష్టాద
శమహావిద్యాస్థానసామ్రాజ్యభద్రాసనా సింధురుద్రావాస విద్వత్సింహంబు
నాతండ్రిహరిస్వామి సమానులయందు త్తమశ్లోకుండగుంగాక। మహాశ్మ
శానంబునందనూచానంబగు నా బంధువర్గంబు బంధువర్గపుత్రీఁగయుం
బోలెఁ గొనసాగి బ్రతుకుంగాక యని యాశీర్వదించి॥ సీ॥ ఏప్రభాతంబుల
నీశానవాపికనవిశంబు తీర్థమాడిన ఫలంబు। వివిధభంగులనేను విశ్వేశ్వరస్వా
మిను త్రికాలపినిష్ఠ(మ్ముగ్గు)ఫలము। ప్రతిచతుర్థినిడుంఠి భక్తిభవస్తుతినే
నారాధనము సేయునట్టి ఫలము। నానందకాననాభ్యంతరక్షేత్రంబునందేసు

జన్మించినట్టి ఫలము। సర్వమును గూడి మీఁదటి జన్మవేళ। నితని కే భార్యగా నన్ను
నిచ్చు గాత । యనుచు మహరిణాంకమూర్తి త్రీవ్రాంశుఁ బోలెఁ । గోసరకగ్నిఁ
బ్రవేశించెఁ గువలయాక్షి॥ క॥ లింగత్రయగర్భిణియగు । నంగనసాన్నిధ్య
మునని శాటుంకుసుద । త్సంగతి విద్యాధరరా । జంగాంచిరిత్రితశేపదమును
కృతిస్ఫురణ॥ వ॥ అంతఁ గొంతకాలంబునం బ్రియాస్మరణంబు సేసెం
గావున విద్యాధరకుమారుండు మలయకేతుండను నామంబునను నగ్నిప్రవేశ
సమయంబున నవ్విద్యాధరకుమారుండు తనకుం బతి కావలయునని కోరెంగా
వున సుశీల కళావతియను పేర ధాత్రీతలంబున జన్మించి వధూవరులై రాదఁసతు
లయుండుఁ గళావతిదేవి పూర్వజన్మవాసనావశంబున॥ మ॥ అళినీలాలకదా
ల్చుఁ జన్నుఁగవ రుద్రాక్షావళీదామకం । బులు ముక్తామణిభూషలొల్లదసి
తాంభోజాతపత్రాక్షి మై । నలఁదుం భస్మములందనొల్ల దొకనాఁడైనం బ
టీరద్రవం । బులు బన్నీరు కురంగనాభియును గర్పూరంబు కాశ్మీరముం॥ గీ॥ క
డుపు చల్లంగఁ గాంచె నక్కలువకంటి । మలయకేతుమహీపాలమన్మథునకు।
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవాది । శుభగుణశ్రీసమృద్ధులసుతుల ముగు
ర॥ వ॥ అంత నొక్కనాఁ డొక్క చిత్రకరుఁడు వారణాసీస్థానవృత్తాంతంబు
చిత్రపటంబున లిఖియించి తెచ్చి కళావతీసహితుండైన మలయకేతు సన్ని
ధిం బెట్టిన నవ్విలాసవతి పటంబు చూచి ప్రాగ్జన్మవాసనావశంబునఁ దన్ను మఱ
చి సమాధిస్థయుం బోలె లోచనంబులు మొగిచి ముహూర్తమాత్రం బూరకుండి
కన్నులు దెఱచి యాచిత్రపటంబునం గల యశేషవిశేషంబులు గ్రమంబునం
బూసగ్రుచ్చిన తెఱంగున నగరతిజ్ఞ నింజూపి చూపి ప్రియునికిఁ జెప్పఁ దొడంగె
నాప్రకారంబు గుంభసంభవ నీకుం జెప్పెద నాకర్ణింపుము॥ గీ॥ గాశినగరిధ
సుర్వల్లి గంగ నారి । కోటియుగ్మంబులో లార్కఘుధరధరులు । వృషము బాణం
బుల త్ర్యంబు వృజినరాశి । విశ్వనాథుండు ధన్వి యుర్వీకళత్ర॥ సీ॥ ఇదె విమ
ద్వాహిని యిదె మణికర్ణిక యిదె కాశి నిఖిలకల్యాణరాశి। యదె విధాత్రుకపా
లమవని వ్రాలినచోటు వాఁడె శ్రీమత్కాలవటుకరాజు । పంచతీర్థంబిదె
ప్రణవమంత్రాకృతి మత్స్యపరిస్థానమండలమిదె । కామేశ్వరుఁడు వాఁ
డె స్కందేశ్వరుఁడు వాఁడె వాఁడె వినాయకేశ్వరుఁడు హరుఁడు । శశికిరీటుం
డు పార్వతీశ్వరుఁడు వాఁడె । వాఁడె భృంగీశుఁ డధ్వరేశ్వరుఁడు వాఁడె । వాఁ
డె యుష్టాంగు శేశ్వరుఁడు వాఁడె శివుఁడు। ధర్మశాస్త్రేశ్వరుఁడు వాఁడె ధరణినాథ॥
గీ॥ ఇతఁడు పారస్వతేశ్వరుం డిందుమౌళి । యితఁడు రత్నజాతీశ్వరుఁ డిభవి
రోధి । యతఁడు శైలేశ్వరుఁడు భుజఁగాభరణుఁడు । సప్తజలధీశ్వరుఁడు వాఁ

డెళంకరుండు॥ సీ॥ సప్తకోటిమహామంత్రమ్ములకు సనీశ్వరుండితఁడు మంత్రేశ్వరుండు। త్రిపురేశ్వరుఁడువీఁడె త్రిపురదానవులకు సాన్నిధ్యమై పూజగొన్న వేల్పు। బాణేశ్వరుఁడువీఁడె బాణాసురునకు వే భుజములిచ్చిన చంద్రభూషణుండు। వైరోచనేశుండువాఁడె ప్రహ్లాదేశనామ దేశ్వరులల్ల వారెచూడు। ధరణినాయకయాదిగదాధరేశ। భీష్మకేశభృగ్వీశగోపీము కుంద। నారసింహేశ్వరాత్రేయ నాథశేష। విఘ్నరాజేశ్వరులఁజూడు వే అువేల॥ గీ॥ బిందుమాధవదేవుఁడానందవిపిన। వీథికాకేళికలకంఠవిష్కి రంబు। పంచనదతీర్థరాజంబుపార్థివేంద్ర। కాశికాఫాలకస్తూరికాతిలకము॥ క॥ ఇదెమంగళకాత్యాయని। యిదెమార్కండేయనాయకేశ్వరలింగం। బి దెధాతపాతకేశ్వర। పదమిఁదిగిరీశేశునికిఁబట్టుమహేశా॥ గీ॥ వేయునేటి కిన్నానందవిపినభూమి। నడుమళశిఖండకోటీరనాగకటక। నిటలలోచనగిరిశ ధూర్జటులుహరులు। నారుబోసినచందానవాటియుంద్రు॥ వ॥ అనిచెప్పిక ళావతి జ్ఞానవాపికాతీర్థంబుఁజూపి॥ సీ॥ స్తంభరోమాంచాదిసాత్త్వికభావం బు లాదండవోఁపంగనవ్వధూటి। మూర్ఛిల్లెనద్భుతంబునఁబొంది భూపతిశిశి రోపచారంబు సేయుచుండె। బుద్ధశరీరిణి వ్యుత్పత్తిగల్భ యాధవళాక్షి బొం దినిదానమెఱిఁగి। చిత్రపటంబుమైఁ జేర్చికర్ణముఁజేర్చిజ్ఞానోదమనియునుజ్ఞా నవాపి। యనియుశివతీర్థమనియుదృఢాక్షరముగ। బలికెముమ్మాఱుచేతనా ప్రాప్తినొందె। సరసిజాతాయతాక్షితచ్ఛబ్దమాత్రి। వాడఁబారినసస్యం బువానఁబోలె॥ వ॥ మలయకేతుండును గళావతీప్రేరణంబునం బుత్రసం క్రాంతరాజ్యభారుండయి వారణాశీపురంబునకరిగి జ్ఞానవాపికాతీరంబునం దపంబాచరించిముక్తుండయ్యెనిదిశివతీర్థమాహాత్మ్యంబుకుంభసంభవయిం కేమియడుగదలచెద వడుగుమనుటయు॥ గీ॥ అనఘనాకుసదాచారమాన తిమ్ము। ధరణిసురుఁడు సదాచారపరతఁగాని। యాత్మసంశుద్ధివడయ లేఁడా త్మశుద్ధిఁ। గానిసిద్ధింపనేరదుకాశివసతి। వ॥ అనినంగుమారస్వామియుతనిం జూచి మనువత్రిభృగుభరద్వాజయాజ్ఞవల్క్యశనోంగిరస యమాపస్తంబ సంవర్తకాత్యాయనబృహస్పతిశాతాతపశంఖలిఖిత పరాశరాదులమార్గం బులసదాచారంబు ప్రసంగానుప్రసంగంబున వివరింపవచ్చిన నపారంబై యుండుఁగావునఁ గుంభసంభవ నీకుదిఙ్మాత్రంబువివరించెద సావధానమ తివై యాకర్ణింపుము॥ గీ॥ చాతురాశ్రమ్యమునుజతుష్కంధమయ్యె। మొ దటిస్కంధత్రయము ధర్మములుపహించు। నగ్రిమస్కంధమొల్ల వింధ్యాద్రి దమన। జ్ఞానసంపద్విభూతికిఁదానకంబు। శా॥ ఓరాత్రింగను తెప్పవేయు

కము హాలాహలోగ్రాంబునకు ధీరతా। ఖ్యానందర్యము పూనుమానవునకుం దాత్సర్యవృత్తిఁ సదా। చారంబెట్టానరింపవచ్చునెగలశీసంజాత కాశీశ్వరుఁ। గౌరీవల్లభుసంస్మరించి బ్రతుకంగాకాతఁడప్రచ్యుతిః॥ గీ॥ ద్విజుఁడు వేఁబోక మేల్కాంచి దివసదినంబె। ప్రత్యవాయపరీహారపరతఁజేసి। స్కాంస్కారిఁ పంగ దగుభక్తిసౌష్ఠవమున। మంగళాస్పదమగు వస్తుమండలంబు॥ వ॥ బ్రాహ్మీ ముహూర్తంబున మేల్కాంచి కృతాచమనుండయి వివిక్తప్రదేశంబున భస్మోద్ధూళనంబును భసితత్రిపుండ్రధారణంబును బొనర్చి రుద్రాక్షమాలికలు ధరియించి పద్మాసనాసీనుండయి హేరంబు నంబికాసహాయుం బ్రద్యుమ్నుం గు లక్ష్మీసమేతుం బుండరీకాక్షు భారతీసహితుం బరమేష్ఠిం బాకశాసన పావకప్రేతరాజ పలలాశిపాశిపవనపౌలస్త్యపశుపతులను వసిష్ఠాదిమునుల గంగాది పుణ్యవాహినుల ప్రయాగాదితీర్థంబుల శ్రీశైలాది పుణ్యపర్వతంబును దుగ్ధోదాదిసముద్రంబుల మానసాదిసరోవరంబుల జ్ఞానవాప్యాదిదీర్ఘికల నందనాదివనంబుల బుష్కరాదిద్వీపంబుల నార్యావర్తాదిజనపదంబుల గామధుగ్ధేన్వాది ధేనువులం గల్పవృక్షాదివృక్షంబులం గాంచనాదిధాతువుల లక్ష్మ్యాది పుణ్యాంగనల గరుడాదిపతంగంబుల శేషాదిమహానాగంబుల నైరావణాదివారణంబులను నుచ్చైశ్శ్రవాది తురంగంబుల గౌస్తుభాదిమణుల నరుంధత్యాదిపతివ్రతల రంభాద్యప్సరసల నైమిశారణ్యాదిపుణ్యారణ్యంబుల వారణాస్యాదిపట్టణంబుల విశ్వేశ్వరాదిలింగంబులం బాంచజన్యాదిశంఖంబుల సుదర్శనాది దివ్యాయుధంబుల వేదాదివిద్యల బద్మాదిపురాణంబుల మానవాదిస్మృతుల గాయత్ర్యాదిమంత్రంబుల సనకాదియోగీంద్రుల నోంకారాది బీజాక్షరంబుల వ్రీహ్యాదిధాన్యంబుల నారదాదివైష్ణవుల బాణాదిశివభక్తుల బ్రహ్లాదాదిభాగవతుల మహాకాళాదిప్రమథుల బద్మాదినిధుల దధీచ్యాదివదాన్యుల హరిశ్చంద్రాదిభూపతుల జననీజనకులబితరులగురులను సంస్మరించి యీయందరు నాకు నాయురారోగ్యైశ్వర్యంబులు ప్రసాదింతురుగాక యనుచుం బ్రార్థించి ప్రణమిల్లి నిలిచి నిత్యనైమిత్తికాద్యనుష్ఠానంబుల నిష్ఠాపరుండయి ద్విజుండొనర్చునది॥ సీ॥ వెడలి యూరికి నైఋతిదిక్కు వింటిదవ్వున దైత్యదెస బహిష్కారంబు దీర్పవలయు। ననువు బవి డ్లమానమగు దూరమ్మున బయలికేగుట పాశీపట్టణమునఁ దల ముసుంగిడి తృణంబులుగప్పినధరిత్రి విణ్మూత్రజలములు విడువవలయు। జెవి బ్రహ్మసూత్రంబు దవిలింపన్ సర్వంబు విట్పరిసవోత్సర్గవేళలందు। దివసముఖసంధ్యలందు దగ్గిఱ్ఱుముఖుండు యామినులయందు శమన దిగాననుండు। నగుచు మౌనవ్రతంబున నవనిసురుఁడు। మలవిమోక్షంబుగావిం

చు గలశజన్మ॥ సీ॥ నిలుచుండికొరాదుజలమధ్యమునగాదు కాదుదున్నిననేల
గాదుమంద। గాదుగోసన్నిధిగాదగ్ని కెదురుండి కాదగ్రజన్ముల కట్టెదురును।
గాదుసస్యంబులగాదురథ్యాభూమిగా దెదురుగాలికి గాదుగాట। గాదుతా
రాదినక్షత్రగ్రహంబుల గనుగొంచుమలవిమోచనంబొనర్ప। శిశ్న మొకచే
తగబట్టించి చెరలుసీమ। లేకశర్కరగాకవల్మీకజంబు। నెలుకకలుగునుగా
నిమన్నెమకిపట్టి యరుగునదిశౌచమొనరింపనవనిసురుడు॥ గీ॥ ముసుగుగవియ
గదిగిచి నెమ్మొగమువాంచి। యంగుళీయుగ్మకమునముక్కులమిపట్టి। మలవిమో
క్షణమొనరించితొలగునపుడు। కనుగొనంగగాద మేధ్యంబు కలశజన్మ। సీ॥ అ
యిదువారములపానాభ్యంతరంబున నొకమాఱుశిశ్నమస్తకమునందు, బది
మాఱులపసవ్యపాణిపల్లవముననిరుగేలులందును నేడుతూరు। లంఘ్రిద్వయం
బునయందొక్కమారుద్రివారి గ్రమ్మఱహస్తవనరుహముల। నంతరాంతర
ములయందునిశ్శబ్దంబుగా బ్రకృత్యంబుసంక్షాళనంబు। గలుగునట్లుగనామలక
ప్రమాణ। మృదులమృత్పిండఖండంబు మేవిమేవి। గంధలేశక్షయావధిగానొ
నర్ప। వలయుశౌచంబుమది కెక్కగలశజన్మ॥ వ॥ ఇదిగృహస్థశౌచంబుదీనికి
ద్విగుణంబుత్రిగుణంబు చతుర్గుణంబును బ్రహ్మచారివానప్రస్థయతులకునియ
తంబై యుండు॥ గీ॥ పగటిశౌచంబులోలసాబాలు రేయి। రాత్రిశౌచంబులో
నర్థమూరుగాత్రి। చోరబాధాదిదుష్టకాంతారమార్గ। మునదదర్ధంబు శౌచం
బుమునివరేణ్య॥ క॥ పురుషులశౌచములోసం। దరుణులకర్ధంబు శౌచతంత్రం
బుమునీ। శ్వరనిష్కారణమింతికి। బురుషునకుందగదు శౌచముందలపంగ॥
గీ॥ ధరణిధరమంతపాడవుమృదాశిగ్నైన। నంబునిధియంతజలమైన ననఘచరి
త। భావశౌచంబు బోలదు బాహ్యశౌచ। మనిరి శౌచక్రియావేదులయినముని
లు॥ గీ॥ అగ్నిహోత్రాహుతులకుజాంద్రాయణాన్న। పిండమునకును శౌచ
మృత్పిండమునకు। గలశసంభవయుసిరికాయయంత। మానమని చెప్పుదురు
గర్మమర్మవిదులు॥ వ॥ అనుష్ణంబులున ఫేనంబులు నబుద్బుదంబులునక్షారంబు
లునలవణంబులు నకలుషంబులు నదుర్గంధరసంబులు నయిన యుదకంబులున
గకనిలుచుండక మాటలాడక వెలిజూడకవంగక లేగుండక వేగిరపడక యజ్ఞో
పవీతంబువిడువక ప్రసారితపాదుండుగాక బహిర్జానుండుగాక చప్పుడుగా
కుండ ముమ్మాఱు బ్రహ్మతీర్థంబున హృదయపర్యంతంబు డిగ్గశుద్ధిబుద్ధ్యర్థంబు
పానీపించునదియనంతరంబయుంగుష్ఠమూలదేశంబున నినుమాఱు గండస్థలం
బునవిరియించినమోష్ఠాధరంబులు ముమ్మారుస్పృశించి యనంతరంబకుడిచే
తంబుడిసిలించినయుదకంబు వామహస్తసంపుటంబుననిలిచిదక్షిణవామపాదం

బులయందు మూర్ధంబునందునుం బ్రోక్షించుచునదిమఱిమాటిమాటికివామహ
స్తోదకంబుస్పృశించుచు నంగుళీత్రయంబున నాస్యంబును దర్జన్యంగుష్ఠంబు
లనాసికారంధ్రంబులు నంగుష్ఠానామికాగ్రంబుల గనిష్ఠాంగుష్ఠయోగంబు
ననాభీరంధ్రంబునుహస్తతలంబున హృదయంబును నంగుళ్యగ్రంబులమస్త
కోభయస్కంధంబుల ముట్టునదికొంద అనుష్ఠానపరులీ చతుర్వింశత్యాచమ
నక్రియలందు కేశవాదిచతుర్వింశతినామంబులుచ్చరింతు రవిక్రమంబువనం
భః పాశనత్రయంబున కేశవనారాయణమాధవనామంబులు గపోలమార్జ
నద్వయంబున గోవిందవిష్ణునామంబులు నంతరాధరోష్ఠమార్జన త్రయంబున
మధుసూదనత్రివిక్రమనామంబులువామహస్తోదకధారణంబున శ్రీధరనామం
బునుదక్షిణవామపాదోదక ప్రోక్షణంబునహృషీకేశపద్మనాభ నామంబులు
శిరఃప్రోక్షణంబునదామోదరనామంబును నంగుళీత్రయాస్యస్పర్శనంబునసం
కర్షణనామంబును దర్జన్యంగుష్ఠనాసారంధ్రద్వయస్పర్శనంబున వాసుదేవప్ర
ద్యుమ్న నామంబులు ననామికాంగుష్ఠచక్షుశ్శ్రోత్రస్పర్శ చతుష్టయంబుననని
రుద్ధపురుషోత్తమాధోక్షజ నారసింహ నామంబులు గనిష్ఠాంగుష్ఠనాభిరంధ్ర
స్పర్శనంబుల నచ్యుతనామంబునుహస్తతలంబున హృదయస్పర్శనంబున జ
నార్దననామంబునుగరాగ్రశిరస్స్పర్శనంబున నుపేంద్రనామంబునునంగుళ్య
గ్రస్కంధస్పర్శద్వయంబున హరికృష్ణనామంబులుచ్చరింతురిది యాచమనప్ర
కారంబు॥ గీ॥ శుద్ధుడగుహృద్గతములభూసురుడునీళ్ల । గళగములభూమిపతి
తాలుగములవైశ్యు। డాస్యగంబులశూద్రుడునాటవియును । నాచమనవే
ళయందువింధ్యాద్రిదమన॥ గీ॥ ముక్తకేశుండుసంవృత మూర్ధగళుడు। గా
కసంక్షాళితాంఘ్రియైత్మాసురుండు। విమలజలముల నాచారవిధి యొనర్ప
నర్హామగు వింధ్యశైలదర్పాపహారి॥ ఉ॥ తుమ్మినయప్పుడుంబురముత్రో
వజరించిన యప్డువారిపా । నమ్మొనరించినప్పు డశనంబుభుజించినయప్పు
నవ్యవ । స్త్రంబుధరించినప్డు దురితంబులుచూచినయప్డు పుణ్యకా । ర్యమ్ము
లయప్డుహేయముల నంటినయప్పుడువారువందగు॥ సీ॥ చిటికినవ్రే
లియంతటిపరిణాహంబు పదివేళ్లనిడుపున బలముగలిగి । తోల్గల్గిత్రో
అలేకతోమంగనను వైనతెరుకాష్ఠమునదంతధావనంబు । వదనసంశుద్ధికైవ
లయుంగావింపంగ బ్రతిపద్దినంబును బర్వతిథియు। షష్ఠియునవమియు సవిత్రు
వాసరమును బరిహార్యములుగావ్రతఘ్నమున । కర్హదివసంబులేక యన
ర్హవేళలంబన్నిదోమంగవలసెనే బదియురెండు । సలిల గండూషములు
సేయుసంవిశుద్ధిగలుగువక్త్రంబునకు బ్రహ్మకర్మనిరత॥ గీ॥ దంతధావనపూ

ర్ఘ్యంబు దానమాడి। ప్రాతరారంభ వేళల బ్రాహ్మణుఁడు। సంధ్యవార్చంగ నల
యునిచ్చలును నిష్ఠ। నర్ఘ్య మీఁదగు నర్కోదయంబున వుడు॥ సీ॥ సౌభా
గ్యమేధా ప్రసాదసంపన్న మహాత్మ్య మహాదయములకు జన్మభూమి। నవ
గంధర్వములయందు స్రవియించు రోఁతచే శుచిగాని మేనికి శుద్ధికరము। తేజంబు
గల్పింప దీర్ఘాయువొనరింపఁ జాలు వాసరముఖస్నానమనఘ। యరుణోదయ
మున మూర్ధాభిషేక మొనర్చి తగును జేయఁగ మంత్రతంత్రవిధులు। స్నానమున
కంగకములు మృత్సంచయంబు। నక్షతంబులుఁ దిలలు దర్భాంకురములు। గోమ
యంబును బావమాని ముఖంబు। లైన రుద్మంత్రములును విధ్యాద్రిదమన॥ వ॥ వి
శుద్ధంబైన మృత్పిండంబు శుచిప్రదేశంబున బెట్టి యుదఙ్ముఖుండును బద్ధబ్ర
హ్మశిఖుండును నై యద్దేవతాకంబులైన మంత్రంబులుచ్చరించుచు సలిలావ
గాహనంబు చేసి॥ క॥ నేమంబొప్పఁగఁ బ్రాణా। యామం బొనరించునది జలాం
తరమునలో। సాముద్రాధిపపాణీ। యామంబు శ్రుతిప్రసూత్ర యజపంబన
ఘా॥ గీ॥ మొదలితుది రెంకృతులతోడ మూర్ధమగుచు। వ్యాహృతులు
మూఁటి నాల్గింటి నధిగమించి। మంత్రరాజంబుగా యత్రిమహిమ నొప్పు। గడు
పుచల్లంగ శ్రుతివిద్య గన్నదల్లి॥ వ॥ గాయత్రీత్రివారజపంబు గాయత్రీప్రాణా
యామంబు గాయత్రీదశవారజపంబు దపంబు జలాంతరమున గాయత్రీ త్రివా
ర జపంబొండె విష్ణుసంస్మరణం బొండెఁ జేయునది స్నానానంతరంబ కారుణ్యాపి
తృప్తీతికరంబు వస్త్రనిష్పీడనం బొనర్చునది యిది స్నానవిధానంబు॥ క॥ ధౌ
తపరిధానపరుఁడై। ప్రాతస్సంధ్యను భజించి బ్రాహ్మణుఁడు గుశా। స్ఫీతకరాం
గుండై ప్రా। ద్యోతనునకు నర్ఘ్య మిచ్చు నుదయింపంగన్॥ వ॥ అనంతరంబ
గాయత్రీజపం బాచరించునది॥ గీ॥ పగలు నిలుచుండి జపియించు నిగమమాత।
మాపు గూర్చుండి జపియించు మహితభక్తి। బ్రాహ్మణుఁడు సంధ్య వార్వని బ్రా
హ్మణుండు। గీతతక్కువ శూద్రుండు కేవలంబు॥ వ॥ ఈ ప్రకారంబున నమధ్యా
హ్న కాలంబునను బ్రహ్మవిష్ణుమహేశ్వరులనింద్రాది దిక్పాలకుల మరీచ్యాది
మహర్షుల మన్వాదిమనువుల సలిలతర్పణంబులం దృప్తిం బొందించునది చం
దనాగరుకర్పూర గంధమిశ్రితంబులగు జలంబులు దర్పణార్హంబులు వేదం
బార్షంబు బ్రాహ్మంబు పైతృకంబను తీర్థంబుల వేదాదితర్పణంబులు నా
చరించునది॥ సీ॥ ఛందంబు త్రిష్టువు చంద్రికాచ్ఛచ్ఛాయ యనభిరామ మభినవ
రూపనంబు। రుద్రుండు దేవత భద్రమాకారంబు గశ్యపుండు మహర్షి గన్న
నోసలు। నాపాదమస్తకం బఖిలాంగకంబులు సర్వర్క్ష్యశాఖాత్రరాత్మకంబు।
లాఁబోతు వాహనం బవతంసకుసుమంబు తరుణసీమ్నలసుధాధామ రేఖ తరణి

బింబంబుగగన సౌధంబుమీఁద। బసిఁడికుంభంబుచందంబు పరిఢవింపఁ। గా
నవచ్చినమధ్యాహ్నకాలసంధ్య। యందుసావిత్రికఖిల విద్యాధినాథ॥ గీ॥ వచ
నపావకుఁబ్రజ్వలింపంగఁజేసి। వైశ్వదేవంబొనర్పంగవలయుశిష్టుఁ। జణకకోద్ర
వమాషనిష్పావకములు। తైలలవణంబులునుగావు తద్విధులకు॥ గీ॥ అగ్నికా
ర్యంబొనర్చియనంతరంబ। హంతకారంబునిష్టఁజేయంగవలయు। హంతకారం
బొనర్పబ్రహ్మసూత్రైన। త్రిదశముఖ్యులుదృప్తిఁబొందుదురుసూవె॥ గీ॥ హం
తకారంబనంగఁ బదాఱుగఱ్ఱ। గలశభవనాల్గుగఱ్ఱ పుష్కరమనంగ। గ్రాస
మాత్రంబుభిక్ష యత్నయ్యమంద్రు। మానిబృందారక తదన్నదానఫలము॥
క॥ బలిహరణముసేయఁగఁదగుఁ। గలశీసుత వైశ్వదేవకర్మాంతమునన్। నిల
యుబహిర్భాగంబున। జలధారాసంయుతముగ శ్రద్ధాపరతన్॥ సీ॥ కైసేసియం
బువైక్లబ్యంబునొందక యుచితపీఠికనంఘ్రులొనరమోపి। యొండెనెఁబ్రా
ఙ్ముఖంబొండెనుదఙ్ముఖం బగుచుఁగూర్చుండి సాజ్యాభిఘార। మభ్యర్ణమగు
విశుద్ధాన్నమాపోశన పూర్వంబుగాఁబ్రాణములునపాన। ములునాదియగు
ధాతువులకై దిటికిఁదృప్తి యావహిల్లంగస్వాహాంతములను। బంచవాయు
నామంబులబరమనిష్ఠ। వేల్చువిప్రుఁడుదర్భలుద్రేళ్ళఁబూని। యశనకబ
ళాహుతులుజఠరాగ్నియందు। గుణమునగుణంబునెన్నఁడు గుడుపనకను॥
గీ॥ కడుపులోఁగాలి కొఱకయింతమెడమువిడిచి। యన్నపానీయములఁదృప్తి
యావహిల్లు। నవనినిర్జరుం డనుపానమనుభవించుఁ। దక్రమైననుశీతలోద
కములైన॥ గీ॥ ధరణినిర్జరుఁడమృతాభిధానశబ్దపూర్వమంత్రంబుసముచితం
బుగబఠించు। సగముప్రాశించి యుదకంబుసగముభూమి। విడువవలయును
హస్తంబుగడిగికొనక॥ వ॥ అప్రక్షాళితదక్షిణహస్తాంగుష్ఠ మూలనిష్ఠ్యూతం
బైనయాసలిలంబ పుణ్యనిలయంబైన రౌరవంబునం బద్మార్బుదనివాసులైన
పితరులకుం దృప్తినావహించుచుం జేతులకువార్చి యాచమనంబుసేసి శుచి
యైనకంకణసలిలంబు వలకాలిపెనువ్రేలిమీఁద ధారయొత్తునది యద్ధారయ
య్యంగుష్ఠంబునాశ్రయించినయంగుష్ఠమాత్రుండగుపురుషుంబరితోషింప
గఁజేయునంతరంబు బొడ్డునివిరికొనుచుం బ్రాణాపానసమానోదానవ్యానం
బులుతృప్తింబొంది నాకునానందంబొసగుగాతయని యాశీర్వదించుకొనునది
తాంబూలచర్వణంబులం బుణ్యకథాశ్రవణంబులంబ్రొద్దుపుచ్చునది॥ గీ॥ వర్ణ
ములలోన బ్రాహ్మణవర్ణ మెక్కు। డాశ్రమంబులలోన గార్హస్థ్యమధిక।
మనఘులఋణవతియైన యాలుసూవె। తగినయవలంబనంబు తద్ధర్మమునకు॥
వ॥ పాదతలంబుల రేఖలంగుష్ఠాంగుళీనఖంబులు మీఁగాళ్ళు గుల్ఫంబులుని

క్కులుజంఘులురోమంబులుజానులూరులుకటినితంబంబుభగంబుజఘనంబు నాభికుక్షిపార్శ్వంబు మధ్యంబువళులు రోమావళి హృదయంబు వక్షోజద్వయంబుచూచుకంబులు జత్రుస్కంధకక్షమణిబంధద్వయంబు విహాకేతులరచెయ్యికృకాటికకంఠంబు చిబుకంబుహనువులుకపాలంబువక్త్రంబు త్రిరోష్ఠాధరోష్ఠంబులుజిహ్వాతాలువులుహసితంబునాసికకన్నులుపక్ష్మంబు భ్రూకర్ణలలాటశిరోరుహంబులునునవదియాఅంగంబులు లక్షణాన్వితంబులు గావలయునట్టిలక్షణవతియైనభార్యగృహలక్ష్మియట్టి గృహిణీకతంబునంగదాగృహస్థుండిహపర సౌఖ్యంబులకుభాజనంబగు నని చెప్పి కుమారస్వామికుంభసంభవునకిట్లనియె॥ గీ॥ ఇన్ని పాటులబడగ లేదిల్వలాసు। రారివర్ణాశ్రమస్థులకలఘుమతుల। కూర్ధ్వలోకంబుముక్కునమూర్పుగాలి।యుడిగినప్పుడెకాశియందొదవుముక్తి॥ వ॥ అనినదాచారవర్ణనంబొనర్చి కుమారుండింక నేమియుడిగెదవనుగు మునినగుంభసంభవుండుజ్ఞాన కారణంబు లెయ్యవియనియడిగినంగుమారుండు॥ గీ॥ అకిలవేదానువచనంబుయజ్ఞపరత। బ్రహ్మచర్యకనిష్ఠదపంబుదమము। శ్రద్ధయుపవాసపరతంత్రతశమంబు। కలశసంభవవిజ్ఞానకారణములు॥ గీ॥ధర్మనిర్మలహృదయశ్రోతవ్యమాత్మ। దారకబ్రహ్మనిష్ఠమంతవ్యమాత్మ। సర్వశాస్త్రప్రవీణద్రష్టవ్యమాత్మ। దంభరహితనిదిధ్యాసితవ్యమాత్మ॥ వ॥ ఆత్మావలోకనంబునకుయోగాభ్యాసంబుపరమసాధనంబు॥సీ॥ కుంభినీధరగుహాకోటరాటవీకుంజగర్భవాసముగాదుకారణంబు। గ్రంథతాత్పర్యపర్యాలోచనక్రియాకర్మఠత్వముగాదుకారణంబు। దానంబువ్రతమునధ్వరములొనుగగల్గుకర్మకాండముగాదుగారణంబు। నాసాగ్రసంవీక్షణంబునాసనబంధకల్పనంబునుగాదు కారణంబు। మానమునుశౌచమునుయంత్రమంత్రములును। గావుకారణములుయోగకలనమునకు। నిశ్చయంబును నభియోగ నిశ్చలతయు। గడకయునునభ్యాసముగానికలశజన్మ॥ గీ॥ ఆత్మదర్పించియెఱుగడన్యంబునెవ్వ। డాత్మసంతుష్టుడెవ్వడ హర్నిశంబు। నాత్మనాత్మనుకను నెవ్వడాత్మవెదుకు। నెవ్వడాతండుయోగలక్ష్మీశ్వరుండు॥ వ॥కొంద ఱాత్మమనస్సమాయోగంబయోగంబండ్రుకొందఱుప్రాణాపానసమాయోగంబయోగంబండ్రు కొందఱువిషయేంద్రియసమాయోగంబ యోగంబయోగంబండ్రు కొందఱు పరమాత్మక్షేత్రజ్ఞ సమాయోగంబ యోగంబండ్రు యమనియమాసనప్రాణాయామప్రత్యాహార ధ్యానధారణసమాధులుం గొంద ఱెనిమిది యోగాంగంబులండ్రు నామతంబాస్థనప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణసమాధులాఅంగంబులయందు ప్రథమాంగంబైన యాసనంబు స్వస్తికా

సనంబు గోముఖాసనంబు పద్మాసనంబు వీరాసనంబు సింహాసనంబు భద్రాసనంబు ముక్తాసనంబు మయూరాసనంబు సుఖాసనంబన బహుభేదంబులంగలిగియుండు నిందొక్కయాసనంబుననాసీనుండై యోగియోగంబభ్యసించునది దంశమశకాకీర్ణంబుగాక కేశభస్మాంగారకీకసాది ప్రదూషితంబుగాక జీవసంకులంబుగాక సర్వబాధావిరహితంబై సర్వేంద్రియసుఖావహంబై మనఃప్రసాదజననంబై కుసుమస్రగ్వాసనాధూపామోదమేదురంబైన ప్రదేశంబున నత్యతృప్తుండును నతి క్షుధార్తుండును విణ్మూత్రబాధితుండును జింతాకులుండునుంగాక నిమీలితాక్షుండై వృత్తులుగూర్పక యింద్రియగ్రామంబునియమించి ప్రాణాయామంబున కుపక్రమించునది॥ గీ॥ యోగియొయ్యొయ్యమరిగించియునుపవలయు। కుక్షిగోళంబులోగాలికుంభకమున। బలిమినిలిపినరోమకూపముల వెడలి। యదిప్రకల్పించుగుష్ఠాదులైనరుజల॥ ఉ॥ ఎంతయుఘోరమైనవిపినేభముమెల్లనమస్తరించిమా। వంతుడుగంతపీఠిగుదెవైచిసుఖంబుననెక్కినట్టుల। శాంతముయోగసాధకుడుప్రాణసమీరణమున్నిసర్గదు। గ్రాంతముమస్తరించియవధానముమైధరియింపగాదగున్॥ గీ॥ కడగిసవ్యాపసవ్యమార్గముల వెలికి। యూనమొనరించుగావునప్రాణమయ్యె। చంద్రనాడికబూరించుసాధకుండు। భానునాడికవిడుచుప్రాణానిలంబు॥ సీ॥ నలినాసనాదినానావిధాసనములగ్రమముమైదేహదార్ఢ్యమువహించు। ప్రాణానిలాయామపరిపాటినివహించునందందకలుషసంహతులనెల్ల। ప్రత్యాహృతిక్రియాపాటవంబునజేసిపావనత్వంబుచేపట్టుమేన। ధారణావిధిధురంధరతాబలంబునజరమైనచిత్తంబుదిరముసేయు। ధ్యానముననీశుజూచిసమాధియుక్తి।గర్మనిర్మూలనక్రియాకర్మఠూర। మైనమోక్షంబుగాంచువింధ్యాద్రిదమన। సాధకుండీదియోగాంగషట్కఫలము॥ గీ॥ దమనియమప్రాణియనగస్తంభనియమ। శమనియనభావనియనగసంయమీంద్ర। ప్రాణపవమానధారణలైదుగలుగ। జెప్పుదురుయోగసిద్ధాంతసిద్ధమతులు॥ గీ॥ ఓడ్డియానముద్రయును మహాముద్రయు। మూలబంధగగనముద్రికలును। సారతరవివేకజాలంధరంబును। ననగయోగముద్రలైదుసుమ్ము॥ వ॥ నాడిశోధనంబునకుం జంద్రసూర్యసంఘటనంబునకు రసపోషణంబునకు మహాముద్రకపాలకుహరంబునజిహ్వాప్రవేశంబుసేసిబ్రహ్మరంధ్రభిన్నవేందుమండలసుధాధారానిష్యందనంబాస్వాదించుటకు నభోముద్ర యదియఖేచరీముద్రయు నుడ్డీనంబగు మహాఖగంబు నహోరాత్రంబునిలుపుటకు నుడ్డియాణముద్రనాదిజలంబుధరించుటకుజాలంధరం బపానమూలంబుబంధించుటకు మూలబంధం బీయైదుముద్రాబంధంబులు సమాధినిష్ఠా

ప్రతిష్ఠాకారణంబులు గుహ్యక్షయాపస్మారాది రోగోపద్రవ విద్రావణంబులు బిందుస్థితికరణకారణంబులు గంధవహాధారణాధురంధరంబులు॥ గీ॥ ఊర్ధ్వము ననున్న ప్రాణంబునొడిచితివుచు। గ్రిందనున్నయపానంబుగిట్టిపట్టి। యూర్ధ్వము ననున్న ప్రాణంబునొడిచితివుచు। గ్రిందనున్నయపానంబుగిట్టిపట్టు॥ క॥ మానక జీవుడు ప్రాణా। పానంబులచేతినివియబడు వెలుపలికి। లోనికినెక్కుచు డిగ్గుచు। బౌనఃపుణ్యమునబడ నిపాటులబడు చుర్వి॥ వ॥ హంకారంబునబహిర్గమనంబును సకారంబుననంతర్గమనంబును జేయుచు హంసహంసయను ప్రణవాత్మకమూలభూతంబగునజ్జపమంత్రంబునదివారాత్రంబులిరువదియొక్క వేయిన్నాఱునూఱువారంబులు శ్వాసనిశ్వాసరూపంబునజీవుండుజపించు నమ్మహామంత్రంబు సంకల్పమాత్రంబున॥ సీ॥ వినుదూరవార్తలువీక్షించుదవ్వుగానడుచును శతయోజనములగడియ। నక్షతంబగుశాస్త్రమైనవక్కాణించు గౌరవంబొందులాఘవముజెందు। బరకాయముల జొచ్చుబక్షికీటమృగాదిబహుజీవజాతులభాషలెఱుగు। దివ్యగంధంబునుదివ్యతేజము దివ్యకర్మంబులునుదివ్యకళయుదాల్చు। మోక్షనగరీమహాద్వారముఖకవాట। విఘటనార్గోహకుంచికావిభ్రమమునానుల్లసిల్లెడుసుషడంగయోగవిద్య। యభ్యసించినసాధకుండద్రిదమన॥ వ॥ ఇదియాభ్యంతరంబైనముద్రాసహితషడంగయోగం బింకబాహ్యంబైనషడంగంబువినిపించెద॥ గీ॥ విశ్వభర్తవిశాలాక్షివిబుధగంగ। దండపాణిచమూనాయకుండుడుంఠి। కాలభైరవదేవుండుకలశజన్మ। కాశినగరిషడంగయోగముగనెఱుగు॥ గీ॥ విశ్వనాయకిదేవత్రివిష్టపేశ। వీరకేదారనాయకోంకారకృత్తి। వాసులిల్వలదైత్యవిధ్వంసివటియు। గాశినగరిషడంగయోగముగనెరుగు। సీ॥ వారాణసీపురవాటిసంచారంబు ఖేచరీముద్రయక్లిష్టచరిత। వేగమైయానందవిపినంబునకురాక భద్రయుడ్డియాణభద్రముద్రి। కాశికానికటగంగావాహినీవారితలధరించుటజలంధరముఘుటజ। శివరాజధానిజేసినమూలబంధంబుమూలబంధంబుసన్మునివరేణ్య। నహుషదమనమహాశ్మశానంబుమీఁద। భక్తిముద్రమహాముద్రపరమయోగ। విద్యనుషడంగముద్రికాన్వితముగాగ। నీకుజెప్పితిదృఢముగానిలుపుమాత్మ॥ అనిన నగస్త్యుండు॥ క॥ ఆయురవసానకాలం। బేయనువునదెలియవచ్చునెఱిగింపుముగాం। గేయాయరిష్టాగమనము। లేయవశకునములుహాచియెరుగంగదగుర్వి॥ వ॥ అనినగుమారుండతనికిట్లనియె॥ గీ॥ వామనానాపుటమునెన్వానికేని। గాలియుచ్ఛ్వాసనిశ్వాసగతిజరించు। బింగళానాడినడువదు పెద్దయేని। వాడుమూఁడబ్దములకునిర్యాణమొందు॥ గీ॥ ఒండెమూఁడహోరాత్రంబులొండెనేని। రెండహోరా

రాత్రిములు సంచరించు హేళి। నరుని కెవ్వనికొక్క వత్సరముగాని బ్రదుకఁడం
ద్రు సుధర్మిణీ ప్రాణనాథ॥ క॥ నాసాపుటయుగమునని। శ్వాసోఛ్ఛ్వాసా
నిలములు సరియైన నుచుట। వాసరము లెవ్వనికిబడి। మాసత్రితయమున వాఁడు
మరణముఁబొందుఁ॥ క॥ ప్రాణానలమెవ్వనికిని। ఘ్రాణపుటీయుగ్మకమున బ్ర
వహింపక సం। క్షీణాయ్వై నోర వెడలు। బ్రాణమతఁడు దొఱఁగు వాసరత్రితయ
మునఁ॥ గీ॥ అదరిపాటెవ్వఁడీక్షించు నాకసమున। హాటకపుగ్గృష్ణపింగళుఁడై
నపురుషుఁ। డాతనికివత్సరత్రయం బవధిసూవె। ప్రాణధారణమునకిల్వలాసు
రారి॥ ఉ॥ తుంమునునింద్రియంబు నిజతోయమలంబులు నొండె నొండె మూత్ర
మ్ములమ్ముదుంము బలదార్ఢ్యముసాలక యెవ్వఁడేనినో। కుక్కమ్మ డినుత్సృ
జింపనతఁడు ప్రాణముతోడఁగూడియే। కమ్మగువత్సరమ్ముగడ గాంచిన
పింమటవాసరార్థముఁ॥ ఉ॥ కానఁడరుంధతిన్ ధ్రువుని గానఁడు విష్ణుపదత్రి
యంబునుం। గానఁడు మాతృమండలము గానఁడు గన్నులుగల్గి యేనియే। మాన
వుఁడమ్మనుష్యునకు మాసములారు విరామ మొందగా। శానగవచ్చు గుంభభవ
కాలునిబంధురసౌధవీథికల్॥ గీ॥ దృఢవివేక యరుంధతీదేవిజిహ్వ। నాసికా
గ్రంబు ధ్రువుఁడిల్వలాసురారి। విష్ణుపదమది భ్రూమధ్యవీథియనఁగ। మాతృమం
డలమక్షిపద్మము మునీంద్ర॥ సీ॥ అసితాదివర్ణంబు నామ్లాదిరసమును నన్యథా
భావంబునం జెనేని। దంతోష్ఠకంధరా తాలుజిహ్వాగ్రంబు లొండొక్కవర్ణం
బు నొండెనేని। గరజేంద్రియంబులు గమదోయికొలుకులు ధూమ్రధూమ్రత్వం
బుదోరసెనేని। నాఖండలీయకంబగు దనుఃఖండంబు నభమునై రేయిగన్పట్టె
నేని। నారుమాసములకు మర్త్యుఁడస్తమించు। వేగనే తెంచి యూసరవెల్లితోం
డ। పాపములను డితలదాక బ్రాకెనేని। నలతఁడు పాణ్మాసముల జూచు యముని
మొగము॥ గీ॥ జలకమాడినపిమ్మట జరణములను। హృదయమున సీళ్లు వేగంబయి
గురబాపు। దర్పణమునీడ దోచు నాత్మ్రముకాంతి। నెవ్వనికి వాఁడు నాత్మెల్లనే
గుదివిక॥ వ॥ మతిఛాయాప్రకంపంబు మతిభ్రంశంబు చంద్రద్వయ సూర్యద్వ
యదర్శనంబు పగలు తారకావీక్షణంబు రాత్రిదారకానభివీక్షణంబు గంధ
ర్వనగరావలోకనంబు పిశాచనృత్తవీక్షణంబు శ్రవణధ్వనిహాని స్వప్నంబునం
దు బిశాచకరవాయసభూతప్రేత శునకగృధ్రగోమాయుబాధ పాశురా
శియూపదండవల్మీకారోహంబు లైలాభ్యంగముండనంబులు మరణ సూచ
కంబులు॥ క॥ ఈదుర్నిమిత్తములలో। నేదైనను నొకటిగాంచి మొదలోనగదుఁ(
ఖేదము నొందక నరుఁడుగ్ర। మోదమ్మున గాశినగరమునకేగదగుఁ॥ వ॥ అని
చెప్పినమహాత్ముని ప్రపంచంబు నిర్వికల్పంబు నిరాకారంబు నిరస్తసమస్తోపా

ధికంబునిత్యంబునగు పరబ్రహ్మంబే క్షేత్రంబును నాశ్రయించి యుండు నా క్షే
త్రంబునందు లలాటనేత్రుండు తారకబ్రహ్మవిద్యావర్ణకర్ణజపుండై కీ
టపతంగక్రిమిసరీసృపాదులగు నానావిధజంతువులకుం బ్రాణాంతకాలంబు
ననభయంబొసంగు నేక్షేత్రంబునకు నుత్తరవాహినియగు వియత్తటినియుప
కంఠంబునంగంఠముక్తాకలాపంబునుంబోలె బ్రవహించు నేక్షేత్రంబున కభ్య
ర్ణంబున మణికర్ణికాతీర్థంబు తీర్థరాజంబు రజనీకరకిరణసందోహ
సందేహదానదీక్షాధురంధరవినిర్మల కబంధకల్లోలమాలికా స్ఫాలితమహా
దేవదివ్యలింగశతసహస్రలక్షకోట్యర్బుదన్యర్బుదంబై మాహాత్మ్యవర్ణం
బుగాం జెప్పట్టియవిముక్తక్షేత్రంబు మహిమయింకనువినవలతు నానతిమ్మని
ప్రార్థించినం గరుణావశంవదుండై శిఖివాహనుండతనికిట్లనియె॥ గీ॥ బ్రా
హ్మణోత్తమపద్మకల్పంబునందు। మనువుస్వాయంభువునికాలమున ధరిత్రి।
యరువదేడు లనావృష్టియైనకతన। దద్దవందురికడునుపద్రవమునొందె॥ సీ॥ అం
భోధితీరంబులద్రికాననములు నాశ్రయించిరి పేదలగుచుమనుజు। లంగళ్ళయుం
దుమిట్టాడమానిసిలేక గుడియుబాడును జిక్కజడియనూళ్ళు। లుద్యానములు
వాపికోదకంబులులేక వృక్షవాటంబులు వెల్లబోయె। వ్యాఘ్రాదులైనక్రూ
వ్యాదహింస్రమృగంబు లెచ్చోటజూచిన నేపుమిగిలె। సంతతముదాను సృజి
యించుజంతుకోటి। గఱువుపాల్పడి మోములుగాళ్ళువాచి। వండగాదిన్నబూరె
లవరుసనడగ। ధాత్రిమసిదిటదప్పి నివ్వెఱపడియెధాత॥ గీ॥ రాజులేని కతంబున
రాష్ట్రములకు। నన్నిటికి బాధగా దరిద్ర్యంతరమున। వారలెనరువదియేండ్లవ
గ్రహంబు। గాచె వెలిబుచ్చ లోకమాతృగాకయుండ॥ వ॥ అప్పుడుచింతాక్రాం
తుండై జగద్యోనిప్రజాక్షయంబున యజ్ఞాది క్రియలుత్పాదనంబొందె సమా
ధిక్రియానాశనంబునసధ్వరభుజులు భూప్రజలబోలె హవిర్భాగద్యభావం
బునబుభుక్షాక్షోభంబువహించి రింక నేమిసేయుదు నొక్కనింబట్టంబుగట్ట
నినాడు సర్వసర్వంసహామండలంబును నాఖండలుండువర్షింపకుండుటంజే
సియెండిబెండువడిపోవుచున్నయది నిఖిలక్షోణీచక్రరక్షకైకధురంధరుండైన
యంతటివాడెక్కడ గలుగునోయని యన్వేషించి మనువంశంబునరిపుంజ
యుండనువానినౌదార్యశౌర్యధైర్యాదిగుణగరిష్ఠుంగాంచి సబహుమానంబు
గానతనికిట్లనియె॥ సీ॥ మనువంశమకుటమండనమో రిపుంజయధరయేలు లవ
ణాబ్ధిగరుసుగాగ। మత్ప్రసాదమున సామర్థ్యంబతీంద్రంబు కలకాలమునుసీ
కుగలుగగలదు। బర్హిర్ముఖ స్నేహపరిపూర్తి మైదివోదాసాఖ్య విఖ్యా
తిదాల్తువీవు। వాసుకితనయవిలాసినీరత్నమనంగ మోహినిభార్యయగును నీ

కు॥ వనిసనంజలి సేసిమహాప్రసాద। మనుచుఁబరమేష్ఠి యావతినాదరించి యి
ట్టులనివిన్నవిం చెదాశ్రీశ్వరుండు।పద్మభవునకుగంభీరభాషణముల॥ ఉ॥ నెట్టి
ననన్ను సత్కరుణనీరధి వేష్టితమైనధాత్రికిం - బట్టముగట్టి చేసినొకబాసపి
తామహయాత్మనెగ్గుగా। బట్టకవినుమ్ము భోగిపసుపర్వులక్రిందనుమీదనుం
డువా।రొట్టువుసత్యమాధరణి నొక్కరుడున్నను జేయరాజ్యముల్॥ వ॥ అనిన
నట్లయగుంగాకయని బ్రహ్మకాశీ నగరంబునకేగి విశ్వనాయకునకత్తెఱంగె
ఱింగించితదనుమతి దివోదాసుంబట్టాభిషేకంబు సేసి సత్యలోకంబునకుంజ
నియెననంతరంబు॥ శా॥ చాటించెన్ మనువంశవర్ధనుడు విశ్వక్షోణి నందం
దఘు। టాటంకారముదుందుభిధ్వనియు గూడన్వేగమై దేవతా-కోటుల్మైనిని
నున్నదప్పగుజుడో కోపంబు పాపంబుపా - త్రాటోపంబుమెయింగుటుంబ స
హితంబయిచేరుడ్డోనాకముల్॥ క॥ పాతాళమునకుజనరో - వాతాశనులెచ
టి కేనివలసిన యెడకుల-భూతము లేగరాయనియు- త్యాతతగతిజాటిరవనిన
ధిపతిమాతల్। వ॥ ఇవ్విధంబున దివోదాసనాసులు కాశిశ్రీశైలకుంభకోణ
కోణార్కపుండరీకపుర పాండురంగమహాకాళకాళహస్తి కాంచివేంకటశ్రీ
రంగవల్మీక రామేశ్వరాది దివ్యస్థానంబులఘుంటాపథంబులఘుంటా డిండి
మధ్వనులతోడంగూడంజాటిన బ్రహ్మకత్తపరానుభావంబునంగుటుంబసహి
తంబుత్ర్యంబకపీతాంబరహేరంబ భైరవదుర్గావీరభద్రప్రధానులగునిర్జరు
లుదమతిమచిందంబులతో దుందుభివేణుమృదంగకాంస్యకాహళ ఢక్కా
హుడుక్కానకంబులమ్రోతదిక్తటంబులఁదీటుకొనం గిరీటకోటిఘటితమణి
మయూఖరేఖాపుంజంబుగల్లయుక సంజపొడవు వేడబంబువిడంబింప ; వెల్లజ
గజంపుగొడుగులపెల్లును డెక్కెయంబుల పెక్కువయునాలపట్టంబులడాలు
నుసీవిరుల తేనయు దాలవృంతంబులడంబును దాంబూలకరంకంబులపొం
కంబును గర్కరీకళాచికాపీఠ గండోపధానమణిమంకురశయ్యా కటాహం
బులగల్మియు మహైశ్వర్యంబుప్రకటింప నిలింపమార్గంబున సవాహను
లుసాయుధులుసపరివారులుసశక్తులు సాలంకారులునై కాశీపట్టణంబున కే
తెంచివిశ్వేశ్వరాదేశంబున నెచ్చోటికైననుంజనువారై గంగాతీరంబునంవిడి
సికాశీశ్వరుండును ననేకక్రియాఫలంబునిజాలునట్టిప్రకారంబువిచారించి యు
టయున్న పెద్దకాలంబునంబట్టియువిముక్తక్షేత్రంబునందునుంబోలె నిజశేఖర
దేశంబునందానధివసించుటఫలంబుగాగోరి తన్నునుద్దేశించి ఘోరవ్రతపం
బు చేసినమందరాచలంబు కృతార్థంబగునట్లుగా నగ్గిరీంద్రంబునందుండిదివో
దాసుప్రతిజ్ఞ చెల్లించువాడై తత్కాలసన్నిహితంబైన నానాదిగ్దేశదేవతా

సమూహంబుగనుంగొనియిట్లనియె॥ ఉ॥ ఓసురముఖ్యులార కమలోద్భవుడాదరమొప్పగాదివో। దాసునకిచ్చినాడువసుధావలయంబుజగద్ధితార్థమై। రాసుతుడాతడీభువనరాజ్యభరంబువహించునప్పుడే । వాసురసిద్ధసాధ్యగరుడాదులవేల్పులబన్నగేంద్రులున్॥ గీ॥ ఆజ్ఞ పెట్టినగానిరాజ్యంబుసేయ । బహుముఖంబైనరాజ్యంబుపదిలపడదు। ఫణులుపాతాళముననుండబాడివారు। నిర్జరులునాకమునయందునిలుచువారు॥ వ॥ అనివరంబువేడినబితామహుండునునాయనుమతివభీప్సితంబునొసంగెననియానతిచ్చి॥ సీ॥ మహనీయరుద్రాక్షమాలికాభరణులుభస్మత్రిపుండ్రకోద్భాసితులును।వికటపాటలజటామకుటవర్ధనులునుసముదీర్ణశార్దూలచర్మధరులు।దంతనిర్మితయోగదండమండితులునునవిలభుగ్నభిక్షాపాత్రాన్వితులును। నాసాశిఖాగ్రవిన్యస్తలోచనులునుబంచాక్షరీమంత్రపఠనరతులు। నైనప్రమథులుగొల్చిరావగజతోడ।నందికేశ్వరునెక్కియానందలీల।సకలజగదీశ్వరుండుపర్జన్యవీధి।మందరాద్రికిగదలెసమగ్రబుద్ధి॥ వ॥ మఱియు సారస్వతేశ్వరుండు రత్నజాతీశ్వరుండు సప్తసాగరేశ్వరుండు శైలేశ్వరుండు త్రిపురేశ్వరుండు బాణేశ్వరుండు ప్రహ్లాదేశ్వరుండు భృంగీశ్వరుండు మొదలైనపరమేశ్వరులు దివ్యజ్యోతిర్లింగమూర్తులు శతసహస్రలక్షకోట్యర్బుదన్యర్బుదసంఖ్యాకులు విశ్వేశ్వరమహాదేవు ననుగమించిరి లోలార్కకేశవులు।విశాలాక్షియుదుంఠివిఘ్నేశ్వరుండును దండపాణియుంగదలి రందఱువేల్పులిరుపక్కియలనుంబిఱుందనుంగూడి రాగాశీశ్వరుండు॥ సీ॥ లవణపాథోధివేలావేష్టితంబైనయల్లనేరెడుదీవియతిక్రమించి। యిక్షురసాబ్ధిపరీతాంచలంబైనప్లక్షాంఘ్రిపద్వీపపరిధిగడచి । హాలారసోదన్వదభిముద్రితంబయినశాల్మలద్వీపభూస్థలముదాటి । ఘృతపయోరాశిసంక్లిప్తావధికమైన చంచత్కుశద్వీపజగతిజేరి। యమ్మహాద్వీపమునకురత్నాఢ్యమైన। మకుటమునుబోలెనొప్పారుమందరమున। గనకకలధౌతమాణిక్యకందరమున । గాపురముసేసెశివుడంబికయునుదాను॥ వ॥ ఇట్లుకృతనివాసుడై యిందుధరుండమ్మందరాచలంబునందు మణికంధరామందిరంబున విహరించుచుం బర్వతరాజనందనంజూచి యిట్లనియె॥ సీ॥ నలినాక్షి నైరావణంబు కుంభములతో సరివచ్చునీగుబ్బచన్నుదోయి। తన్వంగిపారిజాతప్రవాళములతో బ్రతివచ్చునీహస్తపల్లవములు । కాంతకౌస్తుభమణిగ్రావకందళముతో సెనవచ్చునీలేతయిగురుమోవి। యలినీలకుంతలయమ్మింతిపూరంబుతో దొరవచ్చునీముఖసరసఫణితి। యువిదయీయుపమానవస్తువులుగలిగె। నంబునిధియందునీమనోజ్ఞాంగములకు। నిమ్మహామందరాద్రికవ్వమ్ముగాగ। సురలునసురలుసంప్రీతిదపవబ

ట్టి॥ చ॥ చలిబడిలీవ్రఘోషణవశంబుననొక్కటదీగచుట్టునె। త్రిభులయియు
న్న పాపతరిత్రాటిమలంకలనిర్ఘరాంబువుల్ । గిరిగొనిమీదనుండిదిగగన్న
రకంఠిపయోధ్రిదచ్చున। త్రితఫణిరాజుచుట్టిన విధంబుననున్నదిచూడుమిగ్గి
రిన్॥ అనిమొనంత॥ సీ॥ సోమార్కమయమహాసోపానములుడిగ్గి పుష్కరా
భోగంబుపుక్కిలించి - గ్రహతారనక్షత్రగణము నాస్ఫాలించి విధుకిరీటుని
మౌళివెల్లిగొల్పి - వడకుగుబ్బలిరాచవారిమూర్ధంబెక్కి - కనఖలక్షేత్రంబుగౌ
గలించి - కాశికానగరోప కంఠదేశముజూసి యేబ్బూలు ముఖములనేగె
జలధి। కిమ్మహానది యిద్యోటికిరుగెలకుల - విడిసియున్న నల్దిక్కుల వేలుపులు
ను - నంబుధర మార్గమున నేగిరభవుగూడ - మందరమునకు సంభృతానందలీల॥
గీ॥ అపుడుజంబూతరుద్వీపవిపులయందు - వాసికెక్కినయద్దివోదాసునా
జ్ఞ - గొందినందిని నొకకుంటెకుదుపిపేద - యసదభూతంబునుండ నీశ్వరరిభటు
లు॥ క॥ కోయిలఁదిరుమలబెరుమా - గోయిలఁదిరుపతులఁగుంభకోణాదికపు।
ణ్యాయతనంబులమాయం - బయిరెక్కడఁ బోయెనొకొ మురాంతకు ప్రతి
మల్॥ గీ॥ మోసపోకము నానంపముద్దరాలు - దారిసరిసప్పులేక పాతాళము
నకుఁ - దానుగోడుకులు నొకకొంతదడసెనేని - గుదిలపరువరెన్నపుబంట్లుగు
చెలవారు॥ వ॥ అప్పుడు చతురంతమహీమండలంబు సర్వదేవతాశూన్యంబగు
టంజేసి విఘ్నేశ్వ రావసథంబుల స్తవరాజస్తోత్రపాఠంబును కాశికాకో
షంబులవ్యాల్లేఖాదిమంత్రజపంబును శివస్థానంబులఁబంచాక్షరీ పంచబ్రహ్మ
పాశుపతాద్యఘోరశారభాదివిద్యానుసంధానంబును విష్వక్సే నావాసం
బులం బురుషసూక్తద్వాదశాక్ష రాష్టాక్షరప్రధాన నామస్మరణంబును
లేకతక్కందక్కిన వేలుపులగుళ్ళయందును సంధ్యాకాల బలిపటుహాశంఖకా
హళకోలాహలంబుడిగె నేనునుంగన్నాటదేశహాటకమణికిరీటంబును గిష్కిం
ధాచలహేమకూటమతంగగిరిప్రాంతంబును తుంగభద్రాతటి సైకటికంబు
ను భాస్కరక్షేత్రప్రాశికంబును బంపావిరూపాక్షదేవదివ్యవికటపాటలజటా
జూటకోటీపినద్ధముగ్ధేందు లేఖామయూఖ కందళగళదమృతబిందుధారాని
ష్యందసేక సంవర్ధిత సుకుమారసరళసహకారజంబుజంబీరనారికేళ కేసర
కురువకాశోక శాకోటకుటజపారిభద్రదాడిమీ రుద్రాక్షసర్జఖర్జూర భూర్జ
బిల్వచిరిబిల్వాదితరులతాకుంజ ఖంజన్మిహిరకిరణపుంజంబునగు పామిముల
విడిచిమందరాచలంబునకరిగిరివ్విధంబున దేవసంఘంబులుదివికింగాద్రిలేయ
తులంబుబలిసద్మంబునకుంబోవ నిర్ద్వంద్వంబునిరవగ్రహంబు నిస్సపత్నంబు
నుంగాఁ కాశీనగరంబుతనకు మొదలిపట్టణంబుగానించికొనిదివోదాసుండేకవా